# నా గురించి-నా మాట

స్వస్థలం : పోలవరం (ప్రకాశంజిల్లా)

ఉద్యోగం : నీటిపారుదల శాఖలో సూపరింటెండెంట్‌గా

ఇతరములు : 'వ్యాస సుమమాల' (వ్యాస సంపుటి) 'సంగీత జ్ఞానము' (కథల సంపుటి)ను తే. 15.2.95 'విశ్వసాహితి ఆధ్వర్యంలో సిటీ సెంట్రల్ లైబ్రరీలో విడుదల చేయడం జరిగింది. డా. పోతుకూచి సాంబశివరావుగారు, వాకాటి పాండురంగారావుగారు, వేదగిరి రాంబాబుగారు, త్రిపురనేని మహారధిగారు, తదితర మేధావులు వీటిని ప్రశంసించిన తీరు నా జన్మను చరితార్ధం చేసింది. విశ్వరచన, వనిత పత్రికవారూ, కాలక్రమంలో శ్రీదాట్ల నారాయణమూర్తిరాజుగారు 'మయూరి' వీక్లీలో నేను ఫ్రేమ్ కట్టించుకోవాల్సినంత గొప్పగా ఆ రచనలపై సమీక్ష వ్రాశారు. ఈ సమీక్షలను యీ పుస్తకానికి అనుబంధంగా యిస్తున్నాను. తే. 14.5.95న 'విశ్వసాహితి' ఆధ్వర్యంలో 'సాహితీ యువరత్న' అవార్డును అందుకోవడం జరిగింది.

తే 10.9.95న 'విశ్వసాహితి' సంస్థ పక్షాన సిటీ సెంట్రల్ లైబ్రరీలో నాచిత్రాలు, కార్టూన్లు, ఫోటోలు, వగైరాల ప్రదర్శన జరిగి, ప్రముఖ ఆర్టిస్ట్ శ్రీ పి.ఆర్. రాజుగారిచే సత్కరింపబడటమైంది.

వీటన్నిటి వెనుక డా. పోతుకూచి సాంబశివరావుగారి చేయూత ఉన్నది. వారు 'Unilit' లనూ విశ్వరచనలోనూ చాలా గొప్పగా వ్రాశారు నాపై.

తే. 31.12.95న 'విశ్వసాహితి' ఆధ్వర్యంలోనే శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయంలో మానాన్నగారు కీ॥శే॥ పోలవరం సుందర వెంకట శేషాచలపతిరావు గారు శ్రీశ్రీశ్రీ చందలూరు మహాలక్ష్మమ్మ అమ్మవారిపై వ్రాసిన భక్తి పాటలలో కొన్నింటిని పాడి క్యాసెట్ రూపంలో - కల్లూరి మురళీ కృష్ణగారిచే రిలీజ్ చేయించటం జరిగింది. వారి ప్రశంసలూ అందుకోనడం సంభవించింది.

తే. 17.3.96న 'విశ్వసాహితి' ఆధ్వర్యంలో గాయనిగా కవిపురపు ట్రస్ట్ వారి బహుమతిని సిటీ సెంట్రల్ లైబ్రరీలో అందుకోనడం జరిగింది.

తే. 15.6.97న సిటీ సెంట్రల్ లైబ్రరిలో నాకార్టూన్లు, చిత్రాలు ఫోటోల ప్రదర్శన జరిగింది మరలా 'విశ్వసాహితి' వారి 14వ నవయువరచయితల మహాసభల సందర్భంగా.

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ చందలూరు మహాలక్ష్మమ్మ అమ్మవారి దయతో యిప్పుడు (విడివిడిగా వేయించుకోలేక) యీ "కదంబమాల"ను ముద్రించుకొనడమైనది. నాలుగయిదు కవితలను క్రితం విడుదల చేసిన రెండు పుస్తకాలకు అనుబంధంగా ప్రచురించటమైంది. అలాగే కార్టూన్లు, ముగ్గులూ కూడా. ఆఫీసు పనివత్తిడివల్ల, యింట్లో చికాకులవల్ల ఏర్పడిన అనారోగ్యంతో పెద్ద కథలను చిన్న కథలుగా, కవితలుగా, వ్యాసాలుగా,

అనుభవాలుగా చివరకు లేఖలుగా కూడా లిఖించడమైంది. (కొన్నింటనే ప్రచురణకు తీసుకొన్నాను) విజ్ఞులు యీ విషయాన్ని గమనించగలరు.

విషయ పరిజ్ఞానం లేనప్పుడు విమర్శకుడు వేదికపై విమర్శలు గుప్పించగూడదు. రచనలు ప్రచురించే సంపాదకులు (బహుకొద్దిమంది) రచయితకు ఏ వాక్యంవల్ల, విషయంవల్ల గుర్తింపొస్తుందో గమనించి యీర్ష్యతో అంటకత్తెర వేయకుండా ప్రోత్సహించాలి. రచయితలను వారి రచనలపై పాఠకులు వ్రాసే అభిప్రాయాలను ప్రచురించాలి. రచయితల అభిప్రాయాలను తస్కరించి తమవిగా వాడుకొనడం మానాలి.

పుంఖానుపుంఖాలుగా రచనలు చేసే ఓపిక నాకు లేదు. చేసిన బహుకొద్ది కూడా సమాజానికి ఉపయోగపడేలా ఉండాలని నా అభిప్రాయం. నేను చిన్నతనం నుండీ కట్ చేసిన సినిమా బొమ్మలతో చేసిన చాలా పుస్తకాలు, నాకు వివిధ అంశాలపై బహుమతులుగా వచ్చిన పుస్తకాలు, నాకు వేరే వారు బహుకరించినవీ సుందరయ్య విజ్ఞాన కేంద్రానికి అప్పగించడం జరిగింది, ఎందరికో ఉపయోగపడతాయన్న ఉద్దేశ్యంతో. ఆ సినిమాలకు సంబంధించినవి యిద్దరు రీసెర్చ్‌స్టూడెంట్స్‌కు ఉపయోగపడ్డాయని లైబ్రేరియన్ రాజుగారు చెప్పి నప్పుడు నా కృషి ఫలించిందను కున్నాను.

చిత్ర లేఖనంలో బహుమతులందుకొనడం జరిగింది. అందులో కృషి చేయటాన్కి, వర్క్ షాపులో పాల్గొనలేకపోవటాన్కి నాకున్న అనారోగ్యం ఆటంకం. అందుకనే నాకు నచ్చిన చిత్రాలను సులభంగా ఉండే ఫొటోగ్రఫీ ద్వారా తీస్తూ ఉన్నాను, అది ఖరీదైన హాబీ అయినప్పటికీ కొన్ని చిత్రకళా సంస్థల్లో లైఫ్‌మెంబర్ని. అలాగే కొన్ని సాహితీ సంస్థలలోనూ, ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఫొటోగ్రఫీలోనూ మెంబర్ని. ప్రముఖ ప్రొఫెషనల్ ఫొటోగ్రాఫర్ రాజన్ బాబుగారు నా ఫోటోలను చూసి ఎంతో ప్రశంసించి, మన ఆంధ్ర ప్రదేశ్‌లో లేడీస్ ఫొటోగ్రాఫర్స్ అసోసియేషన్ లేదనీ, పెడితే వర్క్‌షాప్‌లవీ నిర్వహిస్తూ హార్డ్‌వర్క్ చేయాలనీ అన్నారు. నా అనారోగ్యరీత్యా నాకు కుదరదని చెప్పాను వారికి. డబ్బులిచ్చీ, పలుకుబడి ఉపయోగించి పత్రికలలో తమ రచనలపై సమీక్షలు తగిన విధంగా వ్రాయించుకుంటున్న యీరోజుల్లో నిస్వార్థంగా నారచనలపై సమీక్షలు చేసిన కొన్ని పత్రికలకూ, నా జన్మకు సార్థకం చేకూరేలా వ్రాసిన దాట్ల నారాయణమూర్తి రాజుగార్కి, అలాగే డా. పోతుకూచి సాంబశివరావుగార్కి హృదయపూర్వక కృతజ్ఞతలు తెల్పు కుంటున్నాను. నన్ను ఎంకరేజ్ చేసే శ్రీ శర్మాజీ, మువ్వా శ్రీనివాస్‌లకూ నా మనఃపూర్వక కృత జ్ఞతలు తెల్పుకుంటున్నాను.

నా జీవితానికి స్ఫూర్తి డా. జి. రామకృష్ణారెడ్డి, ఎమ్. ఎస్. (జగదాంబ నర్సింగ్‌హోమ్) అని సగర్వంగా చెప్పగల్గుతున్నాను.

'ప్రతిభ' అనే సూర్యబింబానికి చేయి అడ్డుపెట్టి ఆ కిరణాలను ప్రసరింప చేయనీయకుండా ఆపటం ఏవరి తరమూ కాదేమో!

అల్పులు అందలమెక్కే రోజులు పోవాలి. నిజమైన ప్రతిభావంతులకు గుర్తింపు రావాలన్నదే నా ఆకాంక్ష.

- శ్రీగిరిరాజు విజయలక్ష్మి

# కమనీయ 'కదంబ' కదన కుతూహలం!

"పిల్లల కన్నులలో ఏడు లక్షల వింతలున్నాయ్" - అంటాడు వాల్ట్ స్టెయిటెఫ్. రోజూ మనం ఎన్నో దృశ్యాలు చూస్తుంటాం.అవే దృశ్యాలు, అవే సన్నివేశాలు, అవే సందర్భాలు -- కానీ ప్రతి దృశ్యంలో, ప్రతీ సన్నివేశంలో, ప్రతి సందర్భంలో సంఘటనలలో, ప్రతి మనిషిలో, ప్రతి జీవిలో ఓ కొత్తదన్నాన్ని చూడగలగాలి. కొత్త అనుభవాన్ని అవగతం చేసుకోవాలి. అంటే పిల్లలుగా మారిపోయి వింతను చూసినట్లుగా వాళ్ళ కన్నులతో చూడగలగాలి.

అలా చూసినప్పుడు --కవి కవిత్వం ఎందుకు రాస్తాడు? రచయిత కథలెందుకు అల్లుతాడు? విమర్శకుడు సమీక్షలెందుకు చేస్తాడు? చిత్రకారుడు బొమ్మలెందుకు గీస్తాడు? -- అన్న ప్రశ్నలన్నిటికీ ఒక్కసారిగా ఒకే సమాధానం ప్రత్యక్షమౌతుంది.

విషయమేమిటంటే - విషయమే కాదు విశేషం కూడా ఓ కవి, రచయిత, చిత్రకారుడు, విమర్శకుడు, గాయకుడు, ఫోటోగ్రాఫర్ ఇలా అన్నీ ఒకరిలోనే ఉండటం! మరో మహత్తరమైన విశేషంగా చెప్పాలంటే ఆ వ్యక్తి ఓ స్త్రీ మూర్తి కావడం! నిజానికి నేడు మహిళలు అన్ని రంగాల్లో ముందంజ వేస్తున్నారనడానికి ఎందర్నో ఉదాహరణగా చెప్పక్కర్లేదు. ఆమె పేరు ఒక్కటీ చాలు - ఆమే...... శ్రీమతి శ్రీగిరిరాజు విజయలక్ష్మి!

మానవ జీవన వికాసానికి కథ దిక్సూచి అని విశ్వసించే వ్యక్తుల్లో ఈమె కూడా ఒకరైవుండాలన్న తలంపు ఈ పుస్తకం చదివిన ప్రతీ పాఠకుడికీ కలగక మానదు.

అవును మరి! ఇందులోని కథలన్నీ చక్కని శైలీ శిల్పం, చిక్కని కథనం, విషయ వివేచన, చీకటి కోణాల్లో దాగిన సత్యా విష్కరణ, స్త్రీ స్వేచ్ఛ, పరిణామ సంస్కరణ వాదాలతో కూడి దాన్ని మించి నిజమైన నిజాయితీతో అవిష్కరించబడిన కథలే అన్నీను! అలాంటి సమీక్షలే అన్నీను, అలాంటి కవితలే అన్నీను!!

'రచన' అనేది రెండు రకాలు. చదివేవి.... చదివించేవి! ఒకసారి చదివాక అవి మనస్సులో ముద్ర వేసుకోకపోతే అవి పటుత్వంలేని నిస్సారమైన రచనలు. కానీ ఈ 'కదంబం'లోని ప్రతి రచనా చదివిన తర్వాత కూడా మనల్ని ఆలోచింప చేస్తుంది. మనసు మీద గాఢ ముద్రవేస్తుంది. స్మృతులుగా మనల్ని వెంటాడుతుంది.

నిజానికీ 'కదంబం' మానవతా స్పర్శతో మన మనస్సుల్లో మమేకమయ్యే మహత్తర మధుర మహనీయ కమనీయ కదంబ కదన కుతూహలం!

"బేకన్" ఓ మాటంటాడు - "కొన్ని పుస్తకాలను రుచి చూసి వదిలెయ్యాలి. మరికొన్నింటిని మింగెయ్యాలి. ఇంకొన్నింటిని నమిలి జీర్ణం చేసుకోవాలి". ముమ్మాటికీ శ్రీమతి శ్రీగిరిరాజు విజయలక్ష్మి గారి 'కదంబ మాలకు' చివరి మాటే వర్తిస్తుందనడంలో సందేహం నిస్సందేహంగా అనవసరం!

హైద్రాబాద్,
20.10.97

---ముప్వా శ్రీనివాస్
ప్రముఖ రచయిత

# విషయసూచిక

1

# లేఖలు

అక్షరాస్యులై ఉండి, దాదాపు చక్కగా వ్రాయగలిన ప్రతిపాఠకుడికి "ఏమనుకుంటున్నారు?" "తారల ప్రశ్నలకు జవాబులు", మొదలైన శీర్షికల ద్వారా వారి వారి అభిప్రాయాలను వ్యక్తం చేసే అవకాశం కల్గిస్తున్నారు. అలాగే మీరు కొత్తగా ప్రవేశపెట్టబోతున్న "తాలరతో ముఖాముఖి ద్వారా తమ అభిమాన నటీ నటులను మనసులో ఆరాధించటమేకాని, స్వయంగా కలుసుకుని, వారిని దర్శించే భాగ్యాన్ని కూడా కొందరికి కల్గించబోతున్నారు. కృతజ్ఞతలు.

*(చిత్రభూమి - తే. 19.11.80)*

## పండుగ అడ్వాన్సు

ప్రతి ప్రభుత్వ కార్యాలయంలోనూ ప్రతినెలా ఆప్కో సంస్థ నుంచి వస్త్రాలు కొనడాన్కి అదనపు పండుగ అడ్వాన్సు చెక్కు ద్వారా మంజూరు చేస్తారు. నెల మొదటి వారంలో మంజూరు చేయటం జరిగితే రెండవ వారంలో బిల్లు పాసైచెక్కు చేతికి అందుతుంది. ఈ జాప్యం వల్ల - ఆప్కో సంస్థ పండుగలకు యిచ్చే 20 శాతం రిబేటు అడ్వాన్సు తీసుకున్నవారికి లభించడం లేదు. ఒక్కోకప్పుడు గవర్నమెంట్ ఉద్యోగులకు (క్రెడిట్ బేసిస్ మీద వస్త్రాలు యిస్తున్నప్పుడు వారికి జి.ఒ. వర్తించినంత కాలం రిబేటు యిస్తే సౌకర్యంగా ఉంటుంది.

(ఈనాడు డైలీ - 6.1.81)

ప్రభుత్వ ఆఫీసుల్లో పనిచేసే ఉద్యోగులకు జనాభా లెక్కల సేకరణ డ్యూటీ వేస్తున్నారు. ఒక్క సెక్షన్‌లో యిద్దరు ముగ్గురికి కూడా యీ డ్యూటీ వేస్తున్నారు. దీని వల్ల ఆఫీసుపనికి అంతరాయం కలుగుతున్నది. నిరుద్యోగులైన విద్యావంతులు ఎంతో మంది ఉన్నారు కదా! ఎంప్లాయ్‌మెంట్ ఎక్చేంజీల ద్వారా వారికి యీ 3 నెలలూ జనాభా లెక్కల సేకరణ పని యిస్తే కొంత కాలమైనా వారికి ఉపాధి కల్పించినట్లవుతుంది.

*(ఈనాడు, సోమవారం 2.2.81)*

## ఇళ్ల నిర్మాణంపై ప్రభుత్వ ఆంక్షలు

"హుడా హౌసింగ్ బోర్డ్ సంస్థలకు యాభై, అరవై గజాలలో కూడా ఇళ్లు కట్టటాన్కి అనుమతి లభిస్తున్నది. కానీ సామాన్య పౌరులకు వంద గజాలలో ఇళ్లు నిర్మించుకోవటాన్కి ప్రభుత్వం అనుమతి నివ్వదు." మధ్య తరగతి ప్రజలు, సామాన్య ప్రజలు రెండు వందల గజాలకు పైగా స్థలాన్ని కొనలేరు. ఆర్థిక స్తోమతు పెద్దగా లేనివారు కొన్ని ప్రత్యేక పరిధుల్లో ఇళ్లు కట్టుకోవటాన్ని అనుమతిస్తే బాగుంటుంది.

(ఈనాడు, బుధవారం 4.2.81)

## ఆఫీసుల్లో వ్యాపారాలు

ఇటీవల దాదాపు ప్రతి ప్రభుత్వ, ప్రయివేట్ సంస్థల కార్యాలయాల లోనూ వాయిదా పద్దతి మీద వివిధ వస్తువులు యిచ్చే వ్యాపారం జోరుగా సాగుతున్నది. ఉద్యోగుల మానసిక బలహీనతలను ఆధారంచేసుకుని డబ్బు గడిస్తున్నారు. దాదాపు ప్రతి ఉద్యోగీ యీ బలహీనతకు బానిస అవుతున్నాడు. పట్టు చీరలు, పాలియస్టర్ చీరల దగ్గర నుండీ పచ్చళ్ల వరకూ వాయిదా చెల్లింపు పద్దతిలో అందిస్తున్నారు. అప్పుల సంఘాలు వేరే ఉన్నాయి. ఇవన్నీ చెల్లించి చేతి కొచ్చిన జీతం చూసుకుంటే గుండె బేజారు కాకతప్పటం లేదు. ఇక చికాకులు, కుటుంబ కలహాలు. అందుకే ఆఫీసుల్లో ఈ విధంగా ఉద్యోగుల బలహీనత కనిపెట్టే వ్యాపారం చేసే వారిపై అదుపు అవసరం. అసలు వీటిని నిషేధించటం అన్ని విధాలా మంచిది.

*(ఆంధ్రప్రభ, మంగళవారం 20.10.81)*

ప్రస్తుతం న్యూసైన్స్ కాలేజీ ఎదురుగా ఉన్న అమీర్‌పేట నుండి నాంపల్లి, చార్మినార్, కోఠి వెళ్లే బస్‌ల స్టాప్ గోల్డ్ స్పాట్ కంపెనీకి ఎదురుగా మార్చారు. ఊరి చివర విసిరేసినట్లున్న యీ బస్‌స్టేజి ప్రయాణీకులకు తలనొప్పిగా ఉన్నది. పంజాగుట్ట కాలనీకి మరీ దగ్గరగా ఉన్నది యిది. సెక్యూరిటీ గార్డ్స్ ఉన్నప్పుడు మాత్రం బస్‌లు యీస్టేజి వద్ద ఆపుతారు. లేకుంటే పాత చోటనో, (మధుబార్) మరీ మధ్యలోనో డ్రయివర్‌ల యిష్టం. ఇక్కడపుతారని అక్కడ, అక్కడ ఆపుతారని యిక్కడ పరుగెత్తి అటూ యిటూ తిరగటంతో ఏదీ సరిగా అందక ఆఫీసులకు నిర్ణీత సమయానికి చేరలేక యిబ్బందిగా ఉన్నది.

*(ఆంధ్ర పత్రిక, మంగళవారం, 18.5.82)*

## పనివేళల్లో మార్పా?

కొత్త మంత్రివర్గం ఆఫీసు పనివేళలను మళ్ళీ మార్చే ఉద్దేశ్యంలో ఉన్నట్లు వినవస్తున్నది. నిజాయితీగా పనిచేసే ఉద్యోగులు ప్రస్తుతమున్న పనివేళల్లో కూడా సక్రమంగా పనిచేస్తూనే ఉన్నారు. అటువంటి వారు తమ సేవలను ప్రభుత్వానికందిస్తూనే ఉంటారు ఎప్పుడూ కూడా. సరైన పనిలేని వారు క్యాంటీన్‌ల వెంబడి తిరగటం, పుస్తకాలు, కబుర్లతో కాలక్షేపం చేయటం అన్ని ఆఫీసులలోనూ నడుస్తున్న చరిత్రే.

రాష్ట్రంలో ముఖ్యమంత్రి వర్గం మారినప్పుడుల్లా యీ ఆఫీసు పనివేళల మార్పుల యెడల ఆసక్తి కనపరచటం జరుగుతున్నది.

పూర్వం ఏడున్నర మళ్ళీ తొమ్మిది తర్వాత పదిన్నర, యిప్పుడు మరలా ఏమో. యీ మార్పులవల్ల ఆహార వేళల్లో కూడా మార్పు జరిగి చాలామంది ఉద్యోగస్తులు యింతకుక్రితమే గ్యాస్ట్రిక్ ట్రబుల్‌తో బాధపడుతున్నారు. మరికొందరిని యీ బాధకు గురిచేయవద్దని, ఆఫీసు వేళలు ప్రస్తుతమున్నట్లే ఉంచమని అభ్యర్థిస్తున్నాను.

(ఆంధ్రపత్రిక, సోమవారం 24-1-83)

## పనివేళలు

ఇటీవల కేంద్రప్రభుత్వం వారు ఉద్యోగుల పనిదినాలను వారానికి ఐదు రోజులకు తగ్గించారు, శని, ఆదివారాలు సెలవులుగా ప్రకటిస్తూ. దీంతో పనిచేసే కాలం కూడా పెరిగింది.

కొందరు రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు కూడా పై విధంగా అమలు చేయమని ముఖ్యమంత్రిని అభ్యర్థిస్తున్నట్టు వినికిడి.

ఆలోచించి చూస్తే యిది ఉద్యోగినులకు కష్టతరమైనది. ఎందుకంటే బాగా పొద్దు లేని కాలంలో చీకటిపడి, యింటికొచ్చి వంట పనులు మొదలు పెట్టాలంటే ఎంతో బాధతో కూడిన పని. ఎటూ నెలలో ఒక శనివారం సెలవు ఉంటున్నది కాబట్టి ప్రస్తుతమున్న టైమింగ్స్ అందరికీ అన్నివిధాలా ఆరోగ్యకరంగా ఉంటున్నాయి.

కాబట్టి మా ప్రియతమ అన్నగారైన ముఖ్యమంత్రి శ్రీ రామారావు ఎవరి వొత్తిడిలకు లొంగకుండా కేంద్ర ప్రభుత్వ పనిదినాలను రాష్ట్రంలో అమలు చేయవద్దని అభ్యర్థిస్తూ-

*(ఆంధ్రపత్రిక, ఆదివారం- 16-6-85)*

## ఉత్తరాలు - శీర్షికకు

అందరూ డా.రవి లాంటి వారే ఉంటే ప్రజలకు ఆస్పత్రులే పవిత్ర దేవాలయాలు, వచ్చే ప్రాణం, పోయే ప్రాణంగా ఉన్న కేసులూ, అతి క్లిష్టమైన కేసులపట్ల డా. రవి తీసుకునే శ్రద్ధాసక్తులు చదువుతుంటే ఆ పాత్రలో డా.రవీంద్రబాబు ప్రతిభ ప్రస్ఫుటమౌతున్నది, 'సుశ్రుత నర్సింగ్‌హోం'' సీరియల్‌లో.

పిల్లలు లేని కొందరు స్త్రీలకు జరుపబడే (నరకాన్ని గుర్తుకు తెచ్చే) టెస్ట్‌లూ, ఎక్స్‌రేలూ తలచుకుంటేనే భయంకంరంగా ఉంటాయి. మల్లిక పాత్రద్వారా అవన్నీ విశదీకరింపబడుతున్నాయి. పిల్లలు లేకపోవటంవల్ల భార్యాభర్తలిరువురి మధ్యా చెప్పలేని దూరం, ఏదో వెలితీ, నిరాశా, నిస్పృహ యివన్నీ స్వానుభవాలే.

నాలాగా ఒక మల్లిక కూడా ఉన్నదనుకునే పిల్లలు లేని స్త్రీలకు ఎంతో ఊరట కలిగించగలదు యీ సీరియల్. విజ్ఞానాత్మకమైన యిటువంటి నవలను అందిస్తున్న రచయితకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

*(ఆంధ్రసచిత్ర వారపత్రిక 30-8-, 5-9-85)*

## 'లేఖలు'' శీర్షికకు

ప్రతిఒక్కరూ తమ 'మానసిక శక్తి'ని దృఢతర్వ పర్చుకోవటానికి ఉపయోగపడే ప్రయోగాత్మక, ప్రయోజనాత్మక రచన ''మానసిక శక్తి'' రచయిత ''అభావి మావిదే'' అభినందనీయులు.

*(ఆంధ్రజ్యోతి వీక్లీ- 26-12-86)*

## పాఠకుల ప్రతిస్పందన

అనువాద నవలలు పుంఖానుపుంఖాలుగా వెలువడుతున్న రోజులివి. నామిని సుబ్రహ్మణ్యం నాయుడుగారి 'మునికన్నడి సేద్యం' నేటి సాహిత్యపు ఎడారిలో ఒయాసిస్సు లాంటిది. అభినందనలు నామినిగార్కి-

*(13-2-89, ఆంధ్రజ్యోతి వీక్లీ)*

# సిటీ ఉత్తరాలు

## సవ్యంగా లేని రోడ్లు

అమీర్‌పేట దుర్గానగర్‌లో రోడ్లు సవ్యంగా లేవు. వర్షాకాలంలో రోడ్లమీద ఉండే గుంతల్లో నీళ్ళు చేరుతున్నాయి. దీంతో యీ రోడ్ల గుండా వెళ్ళాలంటే పాదచారులకు సైతం యిబ్బందిగా ఉంది. ఏ ప్రాంతంలోనైనా రోడ్లు, మంచినీరు వంటి కనీస అవసరాలను కల్పిస్తేనే అభివృద్ధి జరుగుతుంది. ఈ విషయమై అధికారులు యికనైనా చొరవ తీసుకోవాలి.

*(16-2-92- ఆదివారం)*

## అభిప్రాయవేదిక

ముందుగా అభినందించవలసిన విషయం 'జ్యోతిషం' గురించి ఒక పత్రిక రావటం. పండిట్ ఉదయ శంకర్‌గారు చెప్పినట్లు మాజీ ప్రధాని పి.వి.నరసింహారావుగారి నుండి శ్రీమతి లక్ష్మీపార్వతి గురించిన నిజాలు, వగైరా అచ్చుగుద్దినట్లు జరగటం, నేటి కాలంలో ఒక అద్భుతం. అలాగే లేటెస్ట్ సంచికలో వివరించినట్లుగానే ప్రముఖుడు డా.చెన్నారెడ్డి కన్నుమూత.

రాశిఫలాలు, మొదలైనవి పాఠకులందరికీ నచ్చేవే. ఈ శీర్షికవల్ల పాఠకుల అభిప్రాయాలు తెలుస్తున్నాయి. జరిగినవి, జరగబోయేవీ 'కాలజ్ఞానం'కంటే కూడా ఎక్కువగానే తెలియజేయగల్గుతున్నారు.

ఇది ప్రపంచవ్యాప్తంగా కూడా సర్క్యులేట్ అయితే జ్యోతిష్య ప్రాముఖ్యత ఎంతటి గొప్ప విజ్ఞానాన్ని సర్వులకూ అందిస్తున్నదో తెలియగలదనటంలో అతిశయోక్తి లేదు.

# 2 కవితలు

## నాగురించి....

నీటిపారుదల శాఖలో పనిచేస్తున్నా
కానీ
అనారోగ్యానికి
అడ్డుకట్టవేయలేకపోతున్నా
అందుకే
రచన లెక్కువ
చేయలేకపోతున్నా

(తే. 6-3-95న సిటీ సెంట్రల్ లైబ్రరీ, అశోక్‌నగర్‌లో సాధనా-సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జరిగిన 'కవి సమ్మేళనంలో చదివినది.)

## ఎన్.జి.వో...

ప్రక్కవాడు మంచి బట్ట కట్టుకున్నా
కాస్త మంచి టిఫిన్
తెచ్చుకుంటున్నా
ఆఫీసర్ మెప్పును అవతలివాడు
పొందినా
చూసి సహించలేని మనస్తత్వం
నేటి సగటు ఎన్.జి.వోది.

*(తే.19-3-95న విశ్వసాహితి 'గెట్ టు గెదర్'లో త్యాగరాయ గానసభ మినీహాల్‌లో చదివినది)*

## నాయకులు...

ఈనాడు నాయకులంటే
స్వంత ఇంటిని చక్కబెట్టుకునేవారు
బంధుబలగాన్నీ అన్ని విధాల
ఆదుకునేవారు
వారివారి అవసరాలు తృప్తిగా తీరగానే
వారు తప్పుకుంటారు
కాదు తప్పించబడతారు
మరొకరు రంగంలోకి దిగుతారు
వారూ షరా! మామూలే
నిస్వార్థంతో నిజాయితీతో
సాటి ప్రజలకు సేవచేసే
నాయకులే లేరు యీనాడు
ఏ ప్రభుత్వంలోనూ
ఏ సంస్థలోనూ
అలాంటి నీతిపరులు
కొందరెవరైనా
యిప్పటికాలంలో ఉంటే
వారికివే నా జోహార్లు

*(విశ్వరచన. తే.8-12-95)*

## సాధారణ కోరిక...

సెలయేటి ఒడ్డున
అందమైన పర్ణశాల ముందు
మనోహరమైన ప్రకృతి సోయగాల్ని
అవలోకిస్తూ
ఒంటరిగా, ప్రశాంతంగా
అలాగే ఉండిపోవాలనిపిస్తుంది
కానీ
తోడేళ్ళలాంటి మనుష్యులే
ఎక్కువగా ఉన్న యీ అసభ్య
ప్రపంచంలో
నా యీ సాధారణ కోర్కె
తీరేనా!
నేననుకున్న ఆ మధుర క్షణాలు
నెరవేరే రోజు వచ్చేనా?

*(విశ్వరచన, తే.1-10-95)*

## అంతరాలు...

రసికుల కామాగ్నిలో కాలిపోతూ
సర్వస్వం కోల్పోయి
పంచరంగుల బొమ్మల్లా జీవించే
ఉన్నతమైన దేవదాసీల కులం
అధికారికంగా
బ్యాక్‌వార్డ్ క్లాస్
తమలో విజృంభించే రాక్షస
'సెక్స్' కోర్కెలకు
వారిని ఆహుతిస్తూ
దేవదాసీలను చదరంగపు
పావులుగా వాడుకుంటూ వుండే
పెద్ద మనుషులది మాత్రం
సమాజంలో ఫార్వర్డ్ క్లాస్
తరతరాల యీ దురంతాలకు
కాలం 'చెల్లేదెప్పుడో!
సమసమాజ స్థాపన జరిగేదెన్నడో!!'
(విశ్వరచన తే.16-12-95)

## ర్యాగింగ్...

అప్పుడే పుట్టి కళ్ళు విచ్చుకున్న
పసికూనలా
మెడికల్ కాలేజీలోకి అడుగుపెట్టి
ఓక అమాయకపు విద్యార్థి
ప్రజల ప్రాణాలను నిలబెట్టి
'వైద్యోనారాయణో హరిః'
అన్న సూక్తిని భవిష్యత్‌లో అక్షరాలా
నిజం చేద్దామనే సదాశయంతో
కానీ
అతనికి దినదినగండం
నూరేళ్ళాయుష్షులా
బ్రతకాల్సివచ్చే పరిస్థితేర్పడింది
ఒకడు ప్యాంట్ లాగితే: మరొకడు
యూరిన్‌పోసి
దోసిళ్ళలో పట్టి తాగమన్నాడు
మలం మొహానికి పూసుకోమన్నాడు
మరొక నికృష్టుడు
చేతకాని, చేయలేని, కడుపులో త్రిప్పే
ఛండాలపు పనులెన్నో చేయ
మన్నారు
సీనియర్స్‌గా చలామణవుతున్న నరరూప
రాక్షసులు
ఆ 'పసి మనసు' యీ నీచ
'ర్యాగింగ్'ను
ఆరగించుకోలేకపోయింది
గదిలో ఫ్యాన్‌కు ఉరేసుకుని
తలిదండ్రులకు
బ్రతికిన్నాళ్ళు కడుపులో చిచ్చు
పెట్టి
అంతులేని లోకాలకు పయనమై
పోయింది
మంచి కళ్ళున్న మనసుగల
మనుషుల కళ్ళల్లో
రక్తం ప్రవహించేలా చేస్తూ
(విశ్వరచన, తే. 11-12-95)

## ఉపోద్ఘాతం

ఉగాది అనగానే కోయిలమ్మ
కుహుకుహులూ, లేతమామిడి
కాయలూ, వేపపూతలూ గుర్తు
తెచ్చుకోవటం మామూలు విషయమే.
అయితే రాజకీయాలపై యీనాడు
సమస్తమూ ఆధారపడి ఉన్నది. కనుక
యీ నా కవిత యీ విధంగా మీ
ముందుంచుతున్నాను.

## ఉగాది బాధ...

ఈ ఉగాది వస్తోందంటే
సామాన్య ప్రజానీకం మనసులో
మెదిలేది రాబోయే స్థిరమైన ప్రభుత్వం
ఆ ప్రభుత్వం అందించే వరాల
మూటల గురించే కానీ
మేధావుల అంచనా ప్రకారం
రాబోయే ఎలక్షన్లలో
ఏ పార్టీకీ పూర్తి మెజారిటీరాకుండా
ఏర్పడే అస్థిర ప్రభుత్వ ఆవిర్భావం
స్థిరంలేని ఆ ప్రభుత భవితలో ఏ
స్థిరమైన
వరాలనందించగలదు ప్రజానీకానికి?
ఇదే అందరికీ యీ ఉగాది అందించే
బాధ!!!

(విశ్వరచన)

## అంతుచిక్కని వింతలు...

'గిజిగాడు' అల్లిన గూడు
ఏ ఇంజనీరు మేధస్సుకూ అందనిది
వివిధములైన పక్షుల కలకూజితాలు
అనూహ్యమైనవి
పూలు మొగ్గ తొడగడం
ఉషోదయానికంతా వికసించటం
చెట్లు ప్రకృతి ధర్మాన్ననుసరించి
విశ్వాస ఘాతకుడైన మానవునికి
నీడను, ఫలాల్నందించటం
రుతుపవనాలు క్రమం తప్పక
జరగటం
జీవరాసుల కనువైన శక్తిని
ప్రసాదించటానికి పగలును
సృష్టించటం
చంద్రుడు ఎటువంటి 'మనసు'నైనా
ఆహ్లాదపరచగల్గే 'వెన్నెల'ను
వెల్గించటం
నిశిరాత్రులు కొందరు నిశాచరుల
ఘోరకృత్యాలకు ప్రతీకలై
ఎన్నో అత్యాచారాలకు.
అన్యాయాలకు అలవాలమైనా
నిన్న, నేడు, రేపు
పైవన్నీ సహజ పరిణామాలైనా
నా కవన్నీ 'అంతుచిక్కని వింతలు'గానే
ఉంటాయి ఎప్పటికీ.

(తే.14-8-న సిటీ సెంటర్ లైబ్రరీలో
జరిగిన కవిసమ్మేళనంలో చదివినది)
(విశ్వరచన తే.3.9.96)

## అభినవ చండికోద్దాలకులు...

భర్త అవునంటే కాదనటం
కాదంటే అవుననటం
ఇష్టమైన వంట చేయమంటే
ఉప్పో కారమో అతిగావేసి
అతి మంచితనంతో అతనేమనలేక
ముద్దలు మింగుతుంటే చూసి
పైశాచిక ఆనందాన్ని పొందటం
అతనో మంచి బట్ట కట్టుకున్నా
సహించలేకపోవటం
అతను ప్రేమతో ఏ వస్తువు తెచ్చినా
దాన్ని పీకి పాకాన పెట్టటం
అతని తరపు బంధు బలగాన్ని
ఆదరించక ఈసడించి పారేయటం
ఇరుగు పొరుగమ్మలకు
పుట్టింటివారికి మొగుడ్ని కొట్టి
మొరపెట్టిన సామెతలాగా
మొగుడిమీద, అత్తమామలమీద

ఆడపడుచుల మీద నాలుగు
చాడీలు చెప్పుకుని వారి
సానుభూతి సంపాదించుకుని
పప్పు, బియ్యాలు దొంగగా అమ్ముకుని
ఆ డబ్బులు, భర్త జేబులో
దొంగిలించిన చిల్లర డబ్బులు
పెట్టె అడుగున దాచుకుని
రెణ్ణెల్లకోసారి అలిగి
పుట్టింటి కెళతానని బెదిరించే
నెపంతో ఎన్ని ఉన్నా లేవు లేవంటూ
ఆబ చావక మరికొన్ని చీరెలు
పుట్టింటి నుండి కొనుక్కురావటం
భర్త ఆఫీసు నుండి వచ్చిచెడి
యింటికి దిగబడే లోపల
మార్నింగ్ షోలకు, మ్యాట్నీలకు ఫ్రీగా
తిరిగి రావటం
యిలాంటివి కొన్ని నేటి
అభినవ చండికల లక్షణాలు!
మన సనాతన సాంప్రదాయపు
ముసుగులో
ఇటువంటి చండికలను విడిపించు
కోలేక
వారి ఆగడాలను భరిస్తూ
కాపురం చేయాలంటే నేటి
'ఉద్దాలకులు' వ్యక్తిత్వాన్ని కోల్పోవాలి
లేదా
అనుక్షణం ఆత్మహత్యా సదృశమైన
నరకాన్ని భరిస్తూ
చావు కెదురు చూస్తుండాలి

(విశ్వరచన తే. 5.'97)

## ఈ ఏటి దీపావళి...

దీపావళంటే మతాబులూ, చిచ్చుబుడ్లూ
గుర్తుకురావీ సంవత్సరంలో
ఏవి మనసును కలచివేస్తాయంటే-
"ప్రభుత్వాన్ని దివాలా తీయించే హవాలా
కేసుల
హైడ్రోజన్ బాంబులూ
పలు రకాల స్కాంలూ, కుంభ కోణాల
కింగ్‌కాంగ్ బాంబులూ
తారాజువ్వల్లా ఆకాశాన్నంటే అవినీతి
రీతులూ
లేకుండా ఉంటే యీ దీపావళి
వెలుగులెంతగా విరజిమ్మేవి!
ఈ కేసులే 'నిల్'అయి, ఏ వ్యక్తి వద్దా
అవసరాన్ని మించిన డబ్బు నిల్వ
లేకుండా ఉంటే
మన భరతమాత అప్పుల ఊబిలో
కూరుకుపోదు కదా!
సహృదయులూ, ధనవంతులూ
స్వచ్ఛందంగా
ముందుకొచ్చి స్వయంగా 'శాశ్వత
గృహాలు నిర్మిస్తే వరద తాకిడికి
గురయ్యే ప్రాంతాలలో
మతాబులు వెలగవా
అప్పుడేకదా! నిజమైన దీపావళి
భారతావనికి!
ప్రస్తుతం ముఖ్యంగా ఆంధ్రావనికి!!!

(సాధన- సాహితీ స్రవంతి వారి 'దీపావళి కవితా- నీరాజనం' (సిటీ సెంట్రల్ లైబ్రరీ) లో తేదీ.9-11-96న చదివినది)

## కాశ్మీరం...

భారతావనికి తలమానికం అందమైన
కాశ్మీరం
చరిత్రాధారల ప్రకారం ఎందరో
మునులు తపమాచరించిన ప్రదేశం
ప్రకృతి అందాలకు ఆలవాలం. సినీ

నిర్మాతల షూటింగ్‌లకూ,
నూత్న దంపతుల హనీమూన్‌లకూ,
టూరిస్ట్‌లకూ, వరప్రసాదం
కొన్ని రకాల పండ్లకూ, పూలకూ,
షాల్స్‌కూ, రకరకాల
దుస్తులకూ ప్రసిద్ధికెక్కిందీ కాశ్మీరం
అందమైన దాన్నెప్పుడూ కబళించాలనే
దురాశ ముష్కరులకు సహజం
ఆ కారణంగానే చైనా, పాకిస్తాన్
దురాక్రమణలు చేశాయి దీన్ని
కొంతభాగం
మిగిలినదాన్నీ రాహు కేతువులు
చంద్రుణ్ణి కబళించిన
చందంగా యీ రెండు దేశాలూ
గుటుక్కున మింగేయాలన్న తాపత్రయం
అందువల్లే కిరాతక చర్యలకు పాల్పడే
ఉగ్రవాదుల ఆవిర్భావం
అనేక రంగుల పూలమొక్కలతో,
సహజసిద్ధమైన
అందాలతో విలసిల్లే కాశ్మీరం
నేడు అన్ని వేపులకూ రక్తం చిందిన
కుంకుమ పువ్వు చందం
ఉగ్రవాదుల పరం కాకూడదీ నందన
వన కాశ్మీరం
భరతమాత కిరీటమైన ఈ భాగం
కాకూడదు మరో దేశ హస్తగతం
అకుంఠిత దీక్షతో ప్రభుత్వమూ,
భారతీయులూ
భరతమాత శిరస్సులోని "అందమైన
నాగరాన్ని"
జారిపోకుండా యిప్పుడు
కాపాడుకోవటం
కోసం నడుం కట్టాల్సిన అత్యవసర
సమయం. *(విశ్వరచన తేదీ. 16-8-97)*

## అంతా టెన్షన్ మయం..

ముక్కునా, నోటా నాలుగు
మెతుకులు కుక్కుకుని
బస్‌కోసం పరుగులు తీసే ఉద్యోగికి
టెన్షన్
వేళకు ఆఫీసుకు చేరతానో లేదో
లేటయితే ఆఫీసరేమంటాడోనని టెన్షన్
కిరోసిన్ క్యూలో నిలబడ్డ సామాన్యునికి
తనవంతు దాకా ఛాన్స్ వస్తుందో
లేదోనని టెన్షన్
సినిమా పిచ్చి ప్రేక్షకుడికి తనవంతు
వచ్చేసరికి టికెట్లయిపోతాయేమోనని
టెన్షన్
రోజుకు నాలుగు ప్రమాదాలు
జరుగుతుండగా
రోడ్డు దాటాలంటే 'యమ' టెన్షన్
పరీక్షలు వ్రాయబోయే విద్యార్థికి
ఎలా వ్రాస్తానోనని, తీరా పరీక్షలయి
రిజల్ట్స్ వస్తాయనుకునేసరికి
పాస్ అవుతానో లేదో ననే టెన్షన్
ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజీలో కార్డు
రిజిష్టర్
చేసిన నిరుద్యోగికి యింటర్వ్యూకు
హాజరయి వచ్చింతర్వాత
ఉద్యోగం దొరుకుతుందో లేదోననే
మరో భయంకరమైన టెన్షన్
ఆపరేషన్ చేయబోయే డాక్టరుకూ
చేయించుకునే రోగికీ టెన్షన్
ఉన్నవాడికి లేనివాడికీ
ఏదో ఒక విధంగా టెన్షన్
టెన్షన్ లెస్ జీవితాలే ఉండవు
టెన్షన్ మోతాదు మించితే మాత్రం
హైపర్ టెన్షనే *(విశ్వరచన, తేదీ. 1-8-97)*

## తేడా

ఏ జీవికయినా
ఆరోగ్యం పున్నమి వెన్నెల వంటిదయితే
అనారోగ్యం అమావాస్య చీకటి లాంటిది
(విశ్వరచన, తే.22-8-97)

## అవస్థ ఒకటే....

సూర్యచంద్రులు తారట్లాడే
పూరిగుడిసెలో నివసించే
పేదవాడికీ మరణ బాధ యమ యాతనే
ఎయిర్ కండిషన్డ్ గదిలో
పట్టుపరుపుపై అంతిమ వేదన
అనుభవించే ధనికుడికీ నరక బాధే
బాహ్య తేడాలు అనేకమైనా
ఇద్దరిలోనూ చావు భయమనే
అవస్థ ఒకటే
(విశ్వరచన 1-9-97)

## మన స్వాతంత్ర్యం...

స్వాతంత్ర్యం వచ్చిందని స్వర్ణోత్సవాలు
జరుపుకుంటున్నాం... కానీ ఆ
స్వాతంత్ర్యం కోసం
భగత్‌సింగ్, అల్లూరిసీతారామరాజు...
మరెందరో మహానుభావుల
ఆత్మార్పణలనూ,
త్యాగాలనూ ఆదర్శంగా మాత్రం
తీసుకోం.
స్వాతంత్ర్యం వస్తూనే భారతమాత
ఒక భుజకీర్తిని కోల్పోయింది- అదే
పాకిస్తాన్
ఆ తర్వాత బంగ్లాదేశ్
ఇవన్నీ మత కల్లోలాలకు కారణమై
యుద్ధాలకు కాలుదువ్వుకునే స్థాయి
కెదిగాం.
పదవుల పందేరం గొడవ అప్పుడే
మొదలైంది
తెల్లదొరల క్రింద బానిస బ్రతుకు
బ్రతికామని
ఆనాడనుకున్నాం- అయితే జనరల్
డయ్యర్‌లాంటి
రాక్షసులు తమ స్వలాభంకోసం
ప్రజలలో ప్రాంతీయ
తత్వాన్ని రెచ్చగొట్టి వారి మాన,
ప్రాణాలతో
చెలగాటమాడిన ఉదంతాలు గల
రాష్ట్రాలు అనేకం నేడు- ఆనాడు
మంచిదొరలు
స్థాపించిన మిషనరీ స్కూళ్ళు,
ఆస్పత్రులవల్ల
క్రమశిక్షణతో మెలగటం నేర్చుకున్నాం-
అప్పుడు
కానీ ఇప్పుడో- అన్ని దేశాలవద్ద
అప్పులు తెచ్చుకుంటున్నాం
పదవుల పందేరాలతో- రకరకాల
స్కాములతో
తలమున్కలయి పోతున్నాం
కాటన్ దొర కట్టించిన ప్రాజెక్ట్ ప్రజల
పాలిట దేవాలయం అయితే
నేటి ప్రాజెక్టులు కూలిపోయేలా
కట్టుకుని
మనమందరం మునిగిపోయేలా మనమే
మనక్రింద గోతులు త్రవ్వుకుంటున్నాం
అన్ని రకాలా రక్షణ లేకుండా
చేసుకుంటున్నాం.
మనకున్న సహజవనరులను

సక్రమంగా
వినియోగించుకోలేకపోతున్నాం
బద్ధకం పెంచుకుంటున్నాం
దిగుమతులెక్కువగా చేసుకుంటున్నాం

నాయకమ్మన్యు లెవరికివారే
డబ్బైనకవేసు కోవటం
మొదలెట్టింతర్వాత
యిహ సామాన్యునికి, మధ్య తరగతి
వానికీ
మిగిలేదేముంది 'బూడిద'

అవినీతి, లంచగొండితనం, పైరవీలు,
ధరలు పెరిగిపోయాయి అనంతంగా
జనాభాను అధికం చేసి దేశ పురోగతికి
అడ్డుకట్టవేసుకుంటున్నాం

కుళ్ళుకుట్రితాలతో కూలిపోతున్నాం
అన్ని రంగాలలోనూ- ఆఖరికి
ప్రతి యింట్లో కూడానూ.

వరకట్నం లాంటి దురాచారాలకు
ప్రాణం పోస్తున్నాం

కుల వృత్తులకు తిలోదకాలు
పలుకుతున్నాం
భేషజాలకు పోయి
తద్వారా నిరుద్యోగాన్ని పెంచి
పోషిస్తున్నాం

వీటన్నింటికీ కారణం
క్రమశిక్షణ లేకపోవటమే
అది మనకై మనకొచ్చేది కాదు
మన మీదొకరి పెత్తనముంటేనే అది
సాధ్యం
అంటే మనం బానిసలుగా
బ్రతకటానికే అలవాటు పడ్డాం
ఇలా కాదు --
ఓ భారతమాత ముద్దుబిడ్డా! వరంగా
వచ్చిన స్వాతంత్ర్యాన్ని పదిలంగా
కాపాడుకోమరి!

(విశ్వరచన)



# ఆర్టికల్స్

## వనితా వేదిక - చర్చ
## ఆడది గడప దాటకూడదా?
## స్వభావం మారాలి

"ఈ ప్రశ్నకు అసలు ఆస్కారమే లేదు. ఎవరు ఎన్ని విధాలుగా అనుకున్నా ఆడది గౌరవప్రదంగా గడపదాటడం స్త్రీ జాతికే శ్రేయస్కరం. అయితే ఆడదాని బలహీనతను అవకాశంగా తీసుకుని తమ కామానికి బలిచేసి, స్త్రీ శీలాన్ని చెరచాలనే స్వభావం ఉన్న వ్యక్తులున్నంతకాలం యిది కష్టమే అవుతుంది. ఈ తత్వాన్ని పురుషులు మార్చుకుంటేనే స్త్రీ యింటా బయటా హాయిగా తిరగగలుగుతుంది.

*(బాలా మూర్తి 20.11.80 ఆంధ్రభూమి మంత్లీలో వేశారు)*

## నేనూ మా ఆయన జాగాలో ఉంటే

వృత్తిని (మావారు ఎలక్ట్రీషియన్) దైవంగా భావిస్తాను. ఒప్పుకున్న పనిని సక్రమంగా నిర్వర్తిస్తాను. కష్టానికి తగ్గ ప్రతిఫలాన్ని స్వయంగా రాబట్టుకోవటానికి కృషి చేస్తాను. ఎందుకంటే లక్షలుపెట్టి, బిల్డింగ్ కట్టించే డబ్బున్న వారే నాలాంటి పనివారికి డబ్బులు సరిగా యివ్వరు కాబట్టి.

ఉచితానుచితాలు లేకుండా అందరి ముందూ నా అహంకారాన్ని ప్రదర్శిస్తూ ఉత్తమురాలైన నా భార్యను అసహ్యంగా ఆవిడ గుండెలదిరేలా తిట్టటం మానేస్తాను.

ఆవిడపై డబ్బు కోసం వత్తిడి తీసుకువచ్చి ఆవిడతో రకరకాలుగా అప్పులు చేయించి, ఆవిడ మానసిక క్షోభ అనుభవిస్తుంటే చూసి ఆనందించడం మానేస్తాను.

దుబారా ఖర్చులను తగ్గించుకుని ఆచి, తూచి, ఖర్చు చేసి, అప్పులు చేయకుండా, నగలు తాకట్టు పెట్టకుండా ఉండేలా ప్రయత్నిస్తాను.

మంచి ఉద్యోగం చేస్తున్నా ఒంటిమీద నగలేమీ లేవునాకు. మంచి బట్ట కట్టుకున్నా కూడా మావారు భరించలేరు. తనెన్ని చేసినా తన తత్వాన్ని చిన్న పిల్లల మనస్తత్వంగా భావించి, సరిపెట్టుకోవాలని ఎప్పటికప్పుడు ప్రయత్నిస్తుంటాను. తన క్షేమం కోసం ప్రార్థనలు చేస్తూంటాను.

*(కలువబాల) 16-30. జూన్, 1987*

## మద్యనిషేధం అవసరమా? చర్చావేదిక:

మద్యపాన నిషేధం అత్యవసరమనే చెప్పాలి. ఈ మద్యపానం మూలంగా ఎనభైశాతం కుటుంబాలు కూలిపోతున్నాయి. ముఖ్యంగా అట్టడుగువర్గాలవారూ, మధ్య తరగతులవారూనూ, ధనిక వర్గాలలో అదో ఫ్యాషన్ యిది.

'మద్యపాన నిషేధం' విషయంలో ఎక్కడికక్కడ లైసెన్సులవీ రద్దు చేస్తూ ప్రభుత్వం పటిష్టమైన కఠిన చర్యలు తీసుకోవాలి. అయితే ప్రభుత్వానికి అధికంగా ఆదాయాన్ని తెచ్చిపెట్టే యీ అంశంపై ప్రభుత్వం సంపూర్ణ నిషేధ చర్యలు తీసుకుంటే ఆ లోటును పూడ్చడానికి ప్రజలపైనే కొత్త రకంగా పన్నులు విధించే అవకాశం వుండవచ్చు. అప్పుడు బాధపడేది అల్పాదాయ వర్గాలవారే. నిషేధం జరిగినప్పుడు దొంగచాటుగా సరఫరాలూ అవలంభించనూ వచ్చు. ఎందుకంటే వరకట్న దురాచారం, శాఖోపశాఖలుగా విస్తరించిన లంచగొండితనాన్ని ప్రజలు ఏవిధంగానూ ఆపలేకపోతున్నారు. కాబట్టి యీ మద్యపాన నిషేధ చట్టానికీ అదే గతి పట్టవచ్చు.

ఏమైనా ప్రతి మద్యపాన ప్రియునిలోనూ మార్పు వస్తే తప్ప చట్టాలూ, ఉద్యమాలూ వేదికలకూ, వీధులకే నిస్సందేహంగా పరిమితమౌతాయి మరి!

*(తేది:15-10-94న జరిగిన చర్చావేదికల్లో యిది చదివాను- స్థలం: సిటీ సెంట్రల్ లైబ్రరీ, అశోక్‌నగర్- విశ్వసాహితి ఆధ్వర్యంలో)*

# ఆత్మహత్యలు ఎలా నివారించాలి?

ఆత్మహత్యల నివారణ గురించి ఆలోచించేముందు అవి జరగడానికి కారణాలు తెలుసుకోవాలి.

పరీక్షలలో ఉత్తీర్ణులుకాని వారూ, భగ్న ప్రేమికులు, కుటుంబ కలతలు భరించలేనివారూ, ఆర్థిక యిబ్బందులను తట్టుకోలేనివారూ, నిరుద్యోగులూ, వృత్తివిద్యలలో అనుకున్న విధంగా విజయం సాధించలేనివారూ, (ఏ వృత్తికి సంబంధించిన కళాకారులైనా కూడా) దీర్ఘకాలిక రోగాలతో బాధపడుతున్న వారూ, నేరస్థులూ, శారీరక, మానసిక రుగ్మతలను తట్టుకోలేనివారూ వగైరాలూ ఆత్మహత్యలకు పాల్పడతారు.

పైన చెప్పినవారు విపత్కర పరిస్థితు లెదురైనప్పుడు వాటిని ఎదుర్కోలేరు. కొందరు సున్నిత మనస్కులవడంవల్ల కూడా ఆత్మహత్యలకు పాల్పడతారు. విద్యార్థులు, నిరుద్యోగులకు వారు నిరాశ పడకుండా తలిదండ్రులూ, గురువుల, స్నేహితుల ఓదార్పు ఎంతో అవసరం. భేషజాలకు పోకుండా ఏ వృత్తినయినా స్వీకరించగల మనోధైర్యం ఉన్నప్పుడు, ఆర్థిక యిబ్బందులను అధిగమించడంద్వారా నిరుద్యోగులూ, వగైరాలు ఆత్మహత్యలకు పాల్పడరు. ప్రేమ విషయాలలో కూడా సమాజాన్ని, తలిదండ్రులనూ ధైర్యంగా ఎదుర్కోవాలి, ఆర్థిక సుస్థిరతను పెంపొందించుకోవాలి. కుటుంబ కలత లేర్పడినప్పుడు అందరూ సమావేశమై సామరస్యస్వభావంతో వ్యవహరించటం నేర్చుకోవాలి. అలాగే విడాకులు తీసుకున్న స్త్రీ పురుషులూ ధైర్యంగా బ్రతకడం అలవర్చుకోవాలి.

దీర్ఘకాలిక రోగులకు కుటుంబ సభ్యుల ఆదరణ ఎంతో అవసరం. శారీరక, మానసిక రుగ్మతలేర్పడినప్పుడు తత్సంబంధిత వైద్యులను సంప్రదించి సరైన వైద్యం చేయించుకుని ఆత్మస్థయిర్యంతో జీవించటానికి ప్రయత్నించాలి యిటువంటి వ్యక్తులు. వీరికి కుటుంబ సభ్యుల ఆప్యాయత, ఆదరణా కూడా ఎంతో అవసరం. నేరస్థులలో ఆత్మహత్యలు నివారింపబడటాన్కి ఆయా రంగాలలోని అధికారుల సహకారం కూడా చాలా ముఖ్యం. అనుకున్న విజయ సోపానాలను అధిరోహించలేని కళాకారులు, వికలాంగులూ, వృత్తి విద్యలలో ఉన్నవారూ ఏ విధంగా కూడా నిరుత్సాహపడకుండా అనుకున్న గమ్యాన్ని చేరు కోవటానికి కృషి చేయాలి తప్ప 'డిప్రెషన్'కు గురి కాకూడదు, కుటుంబ సభ్యులు మృత్యు వాత పడినప్పుడు క్రుంగి పోకుండా చావు, పుట్టుకలు, సహజమేననే భావాన్ని పెంపొం దించుకోవటానికి ప్రయత్నించాలి, కుటుంబంలో ఏ వ్యక్తి మరణాన్నయినా భరింపలేనివారు. ఏ సమస్యకైనా ఆత్మహత్య సరైన, సులువైన సమస్య అని ఏ వ్యక్తీ భావించరాదు. ఆత్మహత్య నేరమనీ, భగవంతుడిచ్చిన జీవిత వరాన్ని తనకున్న పరిధిలో ఆత్మవిశ్వాసంతో అధిగమించాలనీ ప్రతివ్యక్తి భావిస్తే ఆత్మహత్య లనేవి అసలు లెక్కలోకే రావు.

*(విశ్వ రచన, తే: 16-3-95)*

# నేటి విద్య

నేటి విద్య కొంతవరకు విద్యార్థుల మనోవికాసానికి, విజ్ఞానానికి ఉపకరించటంలేదనే చెప్పాలి. చదువుకోవలసి వస్తుందనే నిర్బంధంలో విద్య కొనసాగిస్తున్నారు నేటి విద్యార్థులు. కారణం- విద్యావిధానంలో త్వరిత గతిన వస్తున్న మార్పులు, పాఠ్యపుస్తకాలు ఆయా తరగతుల స్థాయికి మించి ఉండటం. వీటి మధ్య నలిగిపోయి తమకేది కావాలో నిర్ణయించుకోలేక విద్యార్థులలో ఏకాగ్రత లోపించి క్రమశిక్షణ నశించి- అల్లర్లకు, అలజడులకు దారితీస్తున్నాయి.

ఈ స్పీడు యుగంలో తల్లిదండ్రులకు తీరిక సమయాల్లోనైనా పిల్లలకు చదువు చెప్పుకునే టైమ్, ఓపిక ఉండవు. ఇంగ్లీష్ భాషా వ్యామోహంతో శక్తికిమించి డొనేషన్లు కట్టి, కాన్వెంటులలో చదివించడం, అక్కడా సరిగా లేదని ట్యూషన్లు పెట్టించటం చేస్తున్నారేకానీ వారుగా వారి బాధ్యతలను పిల్లల మనసెరిగి ప్రవర్తించటం చేయలేకపోతున్నారు.

ఈ రోజుల్లో ఉపాధ్యాయులు కూడా విద్యార్థులను శాసించే ఆధిక్యతను కోల్పోతున్నారు. దాంతో గురువుల ఎడల భయభక్తులు సన్నగిల్లుతున్నాయి విద్యార్థులలో. తమకు పనికిరాని రాజకీయాలతో ముడిపెట్టుకుని, తరచూ సమ్మెలు, ఆందోళనలూ లేవదీస్తూ క్లాసులకు హాజరు కాకపోవటంతో వారి చదువు- నెలలు, సంవత్సరాల తరబడి కుంటుపడిపోయి, పరీక్ష లొచ్చేసరికి ప్రక్క మార్గాలు తొక్కి, కొందరు విద్యార్థులు పరీక్షలలో నెగ్గుతున్నారు. అది చేతకాని వారు అలాగే ఉండిపోతున్నారు. ఎంత తెలివైన విద్యార్థి అయినా పై విషయాల దృష్ట్యా జీవితంలో పైకిరావాలంటే కష్టమైపోతున్నది. అందుకే, సమర్థులు, మేధావులైన అధ్యాపకులు నియమింపబడాలి.

ఇంకపోతే పెద్ద చదువుల విషయానికొస్తే- రిజర్వేషన్లు. వీటి మూలంగా తెలివిగల విద్యార్థుల ప్రతిభకు గుర్తింపు, అవకాశం లభించటం మృగ్యమైపోతున్నది. వీటిలోటుపాట్లు సవరించాలంటే ఎక్కువ కళాశాలలు స్థాపించబడాలి. ఎక్కడ చూసినా సిఫార్సులూ, డబ్బు ప్రముఖపాత్ర వహించటంతో ఇవి అందుబాటులో లేని విద్యార్థులకు ఇంజినీరింగ్, డాక్టర్ కోర్సు, వగైరాలలో ప్రవేశాలు ఉండటం గగనం అవుతున్నది. ఉద్యోగ అవకాశాలూ అలాగే వుంటున్నాయి. విద్యార్థులలో అశాంతికి ఇవీ ముఖ్య కారణాలే. విద్యావిధానంపై ఏ ఒక్కరి గుత్తాధిపత్యమూ ఉండకూడదు.

విద్యార్థులలో అలజడిని గుర్తించి, తగు విధంగా విద్యావిధానాన్ని మార్పు చేయాలి. పాఠ్యపుస్తకాల సంఖ్యను తగ్గించి వాటి విషయాను క్రమణలో నాణ్యత ఉండేలా రూపొందించాలి. కనీసం పదేళ్ళవరకైనా ఒక పద్ధతంటూ ప్రవేశపెట్టి, దానిని మార్చకుండా ఉండాలి. చిన్న చిన్న పరిశ్రమలు స్థాపించి, ఎవరి సామర్ధ్యానికి తగ్గట్టుగా వారికి అందుబాటులో ఉండేలా ఉద్యోగావకాశాలు కల్పించి, చెదలుపట్టి, లోపభూయిష్టమైన నేటి విద్యావిధానాన్ని సవరించి, దేశ విదేశాలలో సైతం అన్నింటికన్నా గొప్పదైన విద్యను పలువురు ప్రశంసించేలా అమలులోకి తేవాలి ప్రభుత్వంవారు.

# మహిళా ఓ మహిళా

## ర్యాగింగ్‌ను నిషేధించాలి

'ర్యాగింగ్' ఒక్క మెడికల్, ఇంజినీరింగ్ కాలేజీల్లోనే కాదు. ప్రతి చిన్న స్కూళ్ళలోనూ ఉన్నదీ అమానుష క్రీడ. ముఖ్యంగా పల్లెటూరు నుండి వచ్చే విద్యార్థీ, విద్యార్థినులు సున్నిత మనస్కులైన వారు దీని భారినపడి ఆత్మహత్యల పాలవుతున్నారంటే నాగరికులమనుకునే ప్రతిఒక్కరూ సిగ్గుతో తలవంచుకోవాలి.

ఉన్న ఆస్తులను అమ్ముకుని పెద్ద చదువులకు పట్టణాలకు పంపిస్తే ఈ నికృష్ట, నీచ ర్యాగింగ్ భారినపడి తమ పిల్లలు తనువులు చాలిస్తే ఆ తల్లిదండ్రుల బాధ ఎంతటిదో ర్యాగింగ్ పేరిట జూనియర్స్‌ను ఏడిపించే సీనియర్స్ (వీళ్ళు ఒకప్పటి జూనియర్సే కదా!) అర్థం చేసుకోగలరా? అటువంటి వీళ్ళ తల్లిదండ్రులూ శిక్షార్హులేకదా! తమ పిల్లలు రౌడీలుగా మారటానికి రాచబాటవేస్తున్న వారేగా!

ర్యాగింగ్ చేసేవాళ్ళను ఉపాధ్యాయులూ, ప్రిన్సిపాల్స్ పట్టించుకోకపోవడం పెద్ద నేరం. అవసరమైతే పోలీసుల సహాయం కూడా తీసుకోవాలి సదరు ప్రిన్సిపాల్స్, లెక్చరర్స్ వగైరాలు. ర్యాగింగ్ పుణ్యమా అని ఎంతోమంది ఆత్మహత్యలు చేసుకుంటున్నా పట్టించుకునే నాధుడున్నట్లు కనబడదింతవరకూ. మద్యనిషేధం, వరకట్నం వగైరా చట్టాలెలా చేశారో ర్యాగింగ్‌ను నిషేధిస్తూ ప్రభుత్వం తక్షణం చట్టాన్ని రూపొందించి అది పకడ్బందీగా అమలు జరిగే విధంగా ఆదేశాలను అన్ని స్కూళ్ళకూ, కాలేజీలకూ జారీ చేయాలి. అవసరమైతే స్త్రీలు అంటే విద్యార్థినులు ఆదిశక్తి అవతారంలా ఈ చట్ట పరిధి ననుసరించి తమ తమ కళాశాలల్లో అమలు జరిగేలా ఉద్యమించాలి. అప్పుడే ర్యాగింగ్ పిశాచి క్రమంగా అదృశ్యమైపోయి, విద్యార్థీ, విద్యార్థినులు ప్రశాంతంగా, నిర్భయంగా కాలేజీ వాతావరణానికి హాయిగా అలవాటు పడగలరు.

ర్యాగింగ్ అనే పైశాచిక క్రీడ ఒకటున్నదన్న విషయాన్ని అందరూ మరిచిపోయేలా చేయగలగాలి. స్త్రీల సంఘాలూ, ఉద్యమకారులూ తక్షణమే ఉద్యమించాల్సిన తరుణమిది.

*(మయూరి వీక్లీ 20 అక్టోబర్ 95)*

# నేటి ఆధునిక స్త్రీ

అనాదినుండీ పురుషాధిక్య సమాజం మనది. పూర్వకాలం స్త్రీ వంటింటికే పరిమితం. చదువుకున్న స్త్రీలు బహు తక్కువ ఆనాడు.

కందుకూరి వీరేశలింగం పంతులు, రాజా రామ్మోహన్‌రాయ్ తదితరుల కృషి వల్ల బాల్య వివాహాలు ఆపబడి వితంతు వివాహాలు జరిగి స్త్రీల పరిస్థితి కొంత మెరుగుపడింది.

కన్యాశుల్కం నాటి రోజులు, సతీసహగమనాలూ క్రమేణా అంతరించిపోయి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ లాంటి కొందరు సంఘసంస్కర్తల వల్ల స్త్రీలూ, పురుషులతో పాటు విద్యనభ్యసించే విధంగా పరిస్థితులు మారిపోయాయి.

ఆతర్వాత స్త్రీలు క్రమంగా కుటుంబ పోషణార్థం పురుషులకంటే ఎక్కువగా బాధ్యత నల వర్చుకుని పుట్టింట తలిదండ్రులకు చేయూతనిస్తూ వివాహానంతరం అత్తింటి ఆర్థిక పరిస్థితి మెరుగుపడటం కోసం ఉద్యోగాలు చేసే స్థితికి రాబడ్డారు. ఉన్నత పదవులూ, ఉన్నతోద్యోగాలూ చేసే స్థాయికి ఎదిగారు. దేశాలను పాలించే దశకు చేరుకున్నారు. అంటే పూర్తిగా ఆధునికంగా మలచబడ్డారు.

అయితే వ్యక్తిగతంగా భర్తల దురహంకారానికి అనేక మంది స్త్రీలు బలవుతున్నారు. తద్వారా వరకట్న చావులూ, ఎటూ తోచని పరిస్థితిలో ఆత్మహత్యలూ చేసుకుంటున్నారు.

భర్తలు నూటికో, కోటికో తప్ప భార్యల ఉన్నతిని సహించలేరు. ఆ విధంగా కొందరు కళాకారిణులయిన ఉద్యోగినులు భర్తలనుండి విడిపోయి ధైర్యంగా జీవితం సాగించే రోజులు నేటి సమాజంలో అధికమయ్యాయి. పిరికిగా ఆత్మహత్యలు చేసుకునే బదులు స్త్రీలకు అనుగుణంగా తయారైన పట్టాల ప్రకారం దురహంకారులైన భర్తలనుండి విడిపోవడంలో తప్పులేదుకదా! అలాగే ఎన్నో స్త్రీ సముద్ధరణకు నడుం కట్టిన సంక్షేమ సంస్థలద్వారా జీవనోపాధిని కల్పించుకుంటూ వ్యభిచార వృత్తినీ మానుకోవచ్చు. స్త్రీ వ్యభిచరించటానికి కొందరు పురుషులు కారణం కాబట్టి పురుషులూ ఆ పద్ధతిని మార్చుకోవాలి.

పురుషుడు భార్యపై విసిగిపోయినప్పుడు, భార్య గతించినప్పుడు మరో వివాహం కానీ, ఇష్టమైన స్త్రీలతో లైంగిక సంబంధం కానీ పెట్టుకున్నప్పుడు 'అబల'- 'సబల'గా మారిన ఈ రోజుల్లో పురుషుడి పరిస్థితి స్త్రీకే సంభవించినప్పుడు స్త్రీ కూడా పురుషుడితో సమానమనుకునే నేటి ఆధునిక యుగంలో కూడా విశృంఖలత్వానికి పోకుండా ఇష్టమైన విశాల హృదయుడైన మరో పురుషుడితో వివాహం కానీ, లైంగిక సంబంధంకానీ పెట్టుకుంటే తప్పేమిటి? పురుషుడు చేస్తే తప్పుకానిది స్త్రీ ఆచరిస్తే నేరమెలా అవుతుంది?

ఆర్థికంగా స్వతంత్రులైన స్త్రీలు పురుష అహంకారాన్ని ఏవిధంగానూ సహించరాదు. అంటే సాటి ఉద్యోగస్తుడితో మాటాడితే తప్పు, స్వతంత్రించి ఏవైనా కొంటే తప్పు అన్నట్లు ప్రవర్తించే పురుషుల కఠిన ప్రవర్తననీ, పురుషుడు తన కవసరమనుకున్నప్పుడు ఇతరమైన సన్నిహిత సంబంధాలను స్త్రీలతో ఎలా నిర్వహిస్తున్నాడో, స్త్రీలూ అదే పని చేసినప్పుడు పిల్లలూ, సమాజమూ స్త్రీలు చేసిన దానిని సమర్థించే విధంగా ఉండాలి. సమానత్వం అప్పుడే వస్తుంది. అయితే ఆధునిక సమాజంలో లభ్యమవుతున్న స్వేచ్ఛను అడ్డుపెట్టుకుని పుట్టింట్లో, అత్తింట్లో విశృంఖలత్వాన్ని అంటే అనేకమందితో లైంగిక సంబంధాలు పెట్టుకోవటం ఎవరినీ లెక్క చేయకపోవటం లాంటివి ప్రదర్శిస్తే సమాజంలో ఎన్నో నేరాలు జరిగే అవకాశానికి తావిచ్చిన వారవుతారు. భయంకరమైన సుఖరోగాల భారిన పడతారు. అంటే స్త్రీలలోనైనా, పురుషులలోనైనా ఆధునికత పేరిట విశృంఖలత్వం పనికిరాదు. విశృంఖలతవైపు ఏ ఆధునిక స్త్రీ అయినా పయనిస్తే ఆమె అన్ని విధాలా తిరోగమిస్తున్నట్లేనని అంచనా వేసుకోవాలి. ఇది అన్నివర్గాల స్త్రీలకూ వర్తిస్తుంది. స్త్రీ ఆధునికత సమాజ పురోగమనానికి మాత్రమే పరిమితమవ్వాలి.

*(మయూరి వీక్లీ 22-3-96)*

# వ్యభిచారాన్ని చట్టబద్ధం చేయాలి

'కూటికోసం కోటి తిప్పలు' అని కదా! నానుడి. 'ఆకలి' ఎన్నెన్ని నికృష్టపు పనులనైనా చేయిస్తుంది: ఆకలి బాధ అనుభవించిన వారికే అది అవగతమవుతుంది. పవిత్ర భారతదేశంలో శీలానికెంతో ప్రాముఖ్యతనిచ్చే స్త్రీ వ్యభిచారానికి పాల్పడిందంటే మొట్టమొదటి అవసరం ఆకలి. తర్వాత కుటుంబ బాధ్యత. ఏ కులంలోనైనా సంతానంపై పరిమితి ఉంటే 'దరిద్రపు బాధ' దరిచేరదు. అది ఎక్కువవటం వల్లే పురుషుల కంటే కూడా ఎక్కువగా బాధ్యత తెలిసిన స్త్రీలు మరో గత్యంతరం లేక వ్యభిచరిస్తున్నారు. లేక బలవంతంగా ఆ వృత్తిలోనికి దింపబడుతున్నారు. ఏ కూలో నాలో చేసుకుని బ్రతుకుదామన్నా మన పురుషాధిక్య సమాజంలో పరువంలో ఉన్న స్త్రీని సక్రమ మార్గంలో బ్రతకనివ్వరు పురుషులు.

ఏ విధంగానూ గత్యంతరంలేక స్త్రీ వ్యభిచరించటానికి పురుషుడే కారకుడు కాబట్టి, అన్ని రంగాల్లోనూ కుళ్ళు కుత్సితాలు, మాయమర్మాలూ, వగైరా అవలక్షణాలన్నీ ఉన్నప్పుడు వ్యభిచారాన్ని (కేవలం స్త్రీ శరీరంతో జరిగే క్రీడ) చట్టబద్ధం చేస్తే తప్పేమున్నది?

అయితే విశృంఖల సెక్స్ సంబంధాలవల్ల 'ఎయిడ్స్' అనే భయంకర వ్యాధి దాపురిస్తున్నది కనుక విధిగా పురుషుడు కండొమ్స్ వాడాలనే నిబంధన ఉండి తీరాలి. సుఖరోగాలు రాకుండా సరైన మందులు స్త్రీ పురుషులిరువురూ సంభోగ సమయానికి ముందు ఉపయోగించాలి అన్న సూత్రమూ ఉండాలి. చట్టబద్ధం చేయటంవల్ల వృత్తిలో ఉండే మధ్యదళారుల బాధ నుండి వ్యభిచారిణులకు స్వేచ్ఛ లభిస్తుంది.

*(మయూరి వీక్లీ 18 డిసెంబర్ 96)*

# స్త్రీలూ - ఆఫీసుల్లో టాయ్‌లెట్ సమస్యలు

ఉద్యోగం చేసే స్త్రీలు సవ్యసాచులు యీనాడు, ఇంటిపనీ, పిల్లలపనీ, భర్తకీ అన్నీ అందించటం (డబ్బుతో పాటు) మళ్ళీ డ్యూటీకి తయారుకావటం, బస్‌లకోసం పరుగులు పెట్టటం- యిలా ఎన్నో.

కొన్ని కార్యాలయాల్లో స్త్రీలు అవహేళనకూ, పురుషులవల్ల అవమానాలకు కూడా గురౌతున్నారు. ఇది సహజంగా జరిగేదే అని అనుకున్నప్పటికీ స్త్రీకి స్త్రీయే శత్రువులా తయారు కావటం శోచనీయం.

నా క్లోజ్ ఫ్రెండ్ రజని పనిచేసే కార్యాలయం క్యాంపస్‌లో మరికొన్ని ప్రభుత్వ కార్యాలయాలున్నాయి.. అసలు స్త్రీలకు మరుగుదొడ్లే ఉండవు కొన్ని చోట్ల. ఒకవేళ ఉన్నా అవి అపరిశుభ్రంగా ఉంటాయి. అధికారులతో మొరపెట్టుకున్నా పని జరగదు ఒక్కోసారి. ఇలాంటి పరిస్థితులు స్త్రీలు ఎదుర్కొంటున్న సమయంలో ఆ క్యాంపస్‌లోని బిల్డింగ్స్ శాఖకు సంబంధించి మరొక కార్యాలయంలో అన్ని వసతులతో లేవెట్రీలున్నాయి.

అది వాళ్ల చేతుల్లో పనికాబట్టి వాళ్లన్నీ చేయించుకుంటారుట. వాళ్ల శాఖ

క్రిందకే మిగతా కార్యాలయాలన్నీ వచ్చినప్పటికీ తత్సంబంధిత ఉద్యోగి మిగతా వాళ్లకు అలాంటి సదుపాయాలు కల్పించడు. ఎన్ని పిటిషన్లు పెట్టుకున్నా, మంచి మాటలతో చెప్పినా, కొందరు హార్ట్ పేషెంట్స్రూ, గర్భిణీ స్త్రీలు, బలహీనులూ మెట్లెక్కి తమ కార్యాలయంలో ఒకటో అరో ఉండి వెళ్లలేని స్థితిలో ఆ బిల్డింగ్స్ శాఖవారి టాయ్‌లెట్ కెళితే "మాకు తప్ప వాటిని వాడుకునే హక్కు వేరే ఆఫీసువాళ్లకు లేదు, వాళ్ళొచ్చి మా బల్లల మీద కూర్చుని మాకు అసౌకర్యం కల్పిస్తున్నారు" అంటూ ఎవరినీ రానిచ్చే వారుకాదు. "అవి మాకు మాత్రమే" అని బోర్డులు పెట్టేవాళ్లు. ఇదిలా గడిచిన పాతికేళ్లనుండీ జరుగుతున్న తంతు అని రజనీ కథనం. వాళ్లకు నిజంగా కష్టం కల్గించే వాళ్ళుంటే అల్పబుద్ధితో వ్యవహరించకుండా నచ్చచెప్పొచ్చు సౌమ్యంగా, అందర్నీ ఒకేలా అంచనా వేయకుండా, సదరు పేషెంట్లయిన ఉద్యోగులు మా పరిస్థితి యిలా ఉంది, మేమొస్తామని అర్థిస్తే "మీరొస్తే మళ్ళీ అందరూ వస్తారండీ! మాకిబ్బందవుతుంది" అని ఎంతో వయసు,

ఉద్యోగానుభవమూ ఉన్న మహిళల తిరస్కృతిట. రోగిష్టి వాళ్ళకెంత అవస్థో యిలాంటి పరిస్థితుల్లో పాఠకులు అర్థం చేసుకోగలరనుకుంటాను. వాళ్ళ టాయ్‌లెట్స్‌కు మెట్లెక్క నక్కరలేదట. మళ్ళీ మగవాళ్ళల్లో యిలాంటి భేదాలు లేవు టాయ్‌లెట్ల విషయంలో, బసెస్ వద్దానూ?

ఆ శాఖవాళ్ళే మిగతా శాఖల వాళ్ళు 'లేడీస్ స్పెషల్ బస్' ఎక్కితే 'మేం ఎంతో కష్టపడి వేయించుకున్నాం. ఎందుకెక్కుతారు? మీరని' అజ్ఞాన ధోరణిలో మాట్లాడుతుంటారుట.. స్త్రీలలో స్త్రీలకే అసూయలు. ఉద్యోగం చేస్తున్న స్త్రీలలో ఎంతోపరిణతి ఉండాలి? ఆఫీసులను, ఆఫీస్ స్పెషల్స్‌నూ (బస్‌లను) తమ స్వంత ఆస్తికింద భావించి ఇతర స్త్రీలను యిబ్బంది పెడితే సమాన హక్కులు కావాలనే స్త్రీలు ఏం సాధించగలరు?

గాంధీ మహాత్ముడూ, మరెందరో మహానుభావులూ తమ జీవితాలను పణంగా పెట్టి, స్వాతంత్ర్యం కోసం పోరాడి దాన్ని సాధించిన తర్వాత ఎవరికీ స్వాతంత్ర్యాన్ని అనుభవించే హక్కు లేదంటే మన మెక్కడుండేవాళ్ళం? అంతటి విశాల దృక్పథం లేకపోయినా కనీసం టాయ్‌లెట్స్ వద్ద కూడా సాటి స్త్రీల పట్ల ఉదారత ప్రదర్శించకపోతే ఆ స్త్రీలను ఎవరు గౌరవిస్తారు?

స్త్రీని స్త్రీ గౌరవించుకుని, ఆదరించుకునే రోజులు వస్తే తప్ప యిలాంటి సమస్యలు మటుయామం కానేకావు.

*(మయూరి వీక్లీ 14 ఫిబ్రవరి 97)*

# ఆర్టికల్ 498 ఎ

"గంట ముందొచ్చి నిలబడినా నేను అదరగొడుతున్నావేంటి నేనే ముందని, తీయ్..నీ బిందె" అంటూ అవతలావిడ బిందెలాగి తన బిందెను నల్లా కింద పెట్టింది పద్మ.

నల్లా దగ్గర నీటి కోసం కార్మికనగర్ బస్తీలోని ఆడవాళ్ళ గోల రోజూ ఉంటుంది. ఇలాంటి గొడవలు అన్ని ప్రాంతాల్లో యించుమించు ఒకేలా ఉంటుంటాయి.

తన బిందె లాగిందని కోపం వచ్చిన గయ్యాళి చంద్రకళ, ప్రక్కవాళ్లు పద్మనే సపోర్ట్ చేస్తుండటంతో గబగబా యింట్లోకెళ్ళి తన ఏణ్ణార్థం పిల్లాడ్ని తెచ్చి అక్కడొక పెద్దబండ ఉంటే దానిమీద నిలబెట్టింది. "యివతల కొస్తే. చంపేస్తా" నంటూ - అసలే మే నెల ఎండలు పిల్లాడు కాళ్లు బొబ్బలెక్కి విపరీతంగా ఏడవటం మొదలెట్టాడు. చంద్రకళ నోటికి జడిసి. ఎవరూ యివతలకు తీయటానికి సాహసించలేక పోయారు పిల్లాడ్ని.

ఇంతలో చంద్రకళ మామ వచ్చి, పిల్లాడ్ని ఎత్తుకుని, డాక్టర్ దగ్గరకు పరుగెత్తాడు. ఆ చంద్రకళ భర్త రాము ఆమెను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు, ఆటో తోలేవాడే ఐనా తాహతుమించి ఆమెకోసం డబ్బు ఖర్చు పెడతాడు.

సాయంత్రం రాగానే యిదంగా తెలిసి చంద్రకళను తీవ్రస్థాయిలోనే ఆమె భర్త దబాయించాడని ఆమె అలిగి, ఆ మర్నాడు ఒంటి మీద కిరోసిన్ కుమ్మరించుకుని అగ్గంటించుకుంది చంద్రకళ. ఇరుగు పొరుగులు ఆస్పత్రిలో చేర్పిస్తే అసలు గొడవలాదిలేసి, "నా మొగుడే నన్ను కాల్చాడు. ఏనాడు నన్ను సుఖపెట్టిన పాపాన పోలేదు" అంటూ పచ్చి అబద్ధపు మరణ వాంగ్మూలం యిచ్చింది.

రామును అరెస్ట్ చేసి లాకప్‌లో పడేశారు. పుట్టింటి వాళ్లూ యిదే సందని అల్లుడు మంచివాడని తెలిసి కూడా పోలీస్‌లకు వంతపాడారు.

మరొక పొగరుమోతు గీత " అత్త ఉండటాన్కి వీలులేదు, నీవు నావాడివి మాత్రమే" అంటూ ఒకే కొడుకయిన తన భర్తను తన మాటవినటం లేదని, పుట్టింటికెళ్లి, "యింకొంత కట్నం కోసం తనను హింసలు పెడుతున్నాడనీ, రోజూ చావగొడతాడనీ, ఒట్టి శాడిస్ట్ వెధవనీ, అదనీ, యిదనీ పోలీస్ రిపోర్ట్ యిచ్చి అత్తనూ, మొగుడ్నీ అరెస్ట్ చేయించి అక్క, బావా, అన్నల సహాయంతో కోర్టు కెక్కింది.

ఆ తర్వాత వాయిదాల మీద వాయిదా లేయిస్తుండటంతో యిది అబద్ధపుకేసని జడ్జి అర్థం చేసుకునే దాకా వెళ్లింది. ఈ లోగా గిత భర్త రాజారావుతో మంతనాలు ప్రారంభించారు ఆమె అన్నలు లక్షయిస్తే కేసు వెనక్కు తీసుకుంటామంటూనూ.

ఇలా చంద్రకళా, గీతలే కాదు, 498 ఎ ఆర్టికల్‌ని ఒక ఆయుధంగా వాడుకుంటూ మెతకవాళ్లయిన భర్తలను నానా అల్లరులకూ గురి చేస్తున్నారు, చాలామంది స్త్రీలు అన్ని తరగతులకుచెందినవారూనూ.

ఎలా అంటే యీ ఆర్టికల్ కింద అత్తింటివారు వేధిస్తున్నారని స్త్రీ రిపోర్ట్ యివ్వగానే వెంటనే అరెస్ట్ చేసే హక్కు సదరు యంత్రాంగానికున్నది.

స్త్రీ వాదం వెర్రితలలు వేసి, 498 ఎ ఆర్టికల్‌ని దుర్వినియోగ పరుస్తున్నారు, నేటి స్త్రీలు చాలామంది, పైకి చెప్పుకోలేని యీబాధతో పలురకాలైన స్త్రీల సాధింపులకు పురుషులు అల్లాడిపోతున్నారు.

ఈ 498 ఎ ఆర్టికల్‌ని సవరించాల్సిన అవసరం ఉందేమో! ఎందుకంటే దీనివల్ల నిజమైన బాధితులకు మేలు చేకూరినా దీన్ని దుర్వినియోగం చేసే స్త్రీల సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతున్నది కాబట్టి.

(మయూరీ వీక్లీ, 1-8-‘97)

శ్రీగిరిరాజు విజయలక్ష్మి



4

# కథలు

## హేమలతా కాల్షియం ఇంజక్షన్

"అమ్మా! మన ప్రక్కింటి కుముదం అంటీ రోజూ మధ్యాహ్నామప్పుడే డాక్టర్ దగ్గరకెళ్తుం దెందుకే?" ఆశ్చర్యంగా అడిగింది హేమలత తన తల్లి రాధమ్మను.

"ఆ టైమ్‌లో అయితే అంతగా పేషెంట్సుండరట. అందుకే అప్పుడు వెళ్తుంది." కూతురి సందేహం తీర్చింది రాధమ్మ.

హేమలత కొత్తగా ఉద్యోగంలో చేరింది. తండ్రి చిన్నతంలోనే గతించాడు. తల్లినీ, చెల్లెళ్లనూ పోషిస్తూ ప్రశాంతంగా కాలం గడుపుతోంది.

హేమలత సన్నగా తెల్లగా జాజిపూవులా నాజూగ్గా వుంటుంది. పొడవాటి జడ, వెడల్పాటి కళ్లు, సన్నని చిన్ని ముక్కు, బుల్లి నోరూను.

హేమలత తల్లికి పిల్ల సన్నగా వుంది ఏమైనా బలానికి ఇంజక్షన్లవీ యిప్పిస్తే బాగుండునన్పించింది. కూతురితో రోజూ పోరాడటం మొదలెట్టింది. కుముదం, ఆంటీతో వెళ్లి డాక్టరుకు చూపించుకోమని.

తల్లి గోల పడలేక రెండవ శనివారం నాడు కుముదం, ఆంటీతో డాక్టర్ గోపాలకృష్ణ వద్దకెళ్లింది.

కుముదం ఆంటీతోపాటు, తనూ డాక్టర్ కెదురుగా కుర్చీలో కూర్చుంది. హేమలతను పరిచయం చేసింది కుముదం డాక్టర్ గార్కి. సూటిగా హేమలత కళ్లల్లో కొకసారి చూశాడు గోపాలకృష్ణ. ఆ చూపుల్లో ఏ అయస్కాంత శక్తి ఉందో ఏమో హేమలత క్షణంపాటు తత్తరపడింది.

"ఈమెకు బలానికేమైనా ఇంజక్షన్లిమ్మని వాళ్ళమ్మ నాతో పంపించిందండీ...." అని చెప్పింది డాక్టర్‌తో కుముదం.

రక్తం సరిగా ఉందో లేదోనని, కళ్లు చూశాడు. స్టెత్‌తో ఛాతీ, వగైరా చూశాడు. 'లివర్ ఎక్స్‌ట్రాక్ట్ ఇంజక్షన్స్ ఒక కోర్సు తీసుకోండి. బాగా ఆకలి పుడుతుంది. మీ పొడుగుకు తగ్గట్లు లావు కూడా అవుతారు" అంటూ మళ్లీ హేమలత కళ్లల్లోకి చూస్తూ హిప్నటైజ్ చేస్తున్నట్లుగా నవ్వాడు డాక్టర్ గోపాలకృష్ణ.

'అలాగేనంటూ తలూపింది హేమలత.

"ముందు మీరు లోపలకెళ్లండి. ఇంజక్షన్ తీసుకుందురుగానీ...." అంటూ తొందరచేశాడు- కుముదాన్ని డాక్టర్. చంకలో పిల్లాడ్ని హేమలత చేతికిచ్చి ప్రక్కనే ఉన్న రూమ్‌లోకి ఆకుపచ్చని దళసరి కర్టెన్‌ను తోసుకుంటూ వెళ్లింది కుముదం డాక్టర్ వెనకాలే.

లోపల్నుండి ఆదోలా చప్పుళ్లు, గాజుల గలగలలూ, ఎంత లేదన్నా హేమలత చెవిన పడ్డాయి.

ఇంతసేపు ఇంజక్షనేమిటబ్బా! అనుకుంటూ ఆశ్చర్యపోతున్నంతలో కర్టెన్ తోసుకుని డాక్టరూ, అతన్ని రాసుకుంటూ రేగిన జుత్తును సవరించుకుంటూ కుముదం బయటకొచ్చారు.

ఆ తర్వాత తన ప్రక్కనే ఉన్న స్టూల్‌పై కూర్చోమని కుడి చేతికి ఇంజక్షన్ యిచ్చాడు హేమకు డాక్టర్ గోపాలకృష్ణ.

ఈ కోర్సు పూర్తయ్యేలోగా ఎన్నో కనిపెట్టింది హేమ అక్కడ.

మెడికల్ స్టూడెంట్స్ (ఆడవాళ్లు) ఎక్కువగా వచ్చేవారు అక్కడకు. వాళ్లతో ఫ్రీగా మాట్లాడుతూ, నవ్వుతూ, తుళ్లుతూ ఏవిటేవిటో ఇంజక్షన్లిచ్చేవాడు డాక్టర్. రెండు రోజులయింతర్వాత వచ్చిన వాళ్ల మొహాలు చూస్తే పీక్కుపోయి, బక్కచిక్కినట్లుగా అన్పించేవారు హేమ కళ్లకు వాళ్లు,

ఒక రోజు రాత్రి-

'నీకా టైపిస్ట్ కాంతామణే బాగుణ్ణింది! ఇంత ఆలస్యమైనదేం యింటికి రావటాన్కి' అంటూ నిలదీస్తున్నది కుముదం భర్తను.

"నీకెందుకే లంజా అవన్నీ...." అంటూ వీపు పగిలేలా కొట్టినట్లు శబ్దమైంది.

"నేను ఏల .. లంజ - అది పతివ్రతా....." అని ఎదురు తిరుగుతూనే ఉన్నది కుముదం తన్నులు తింటూనే (కన్నడ ప్రాంతం వాళ్లది).

కుముదం భర్త ఆఫీసులోని టైపిస్ట్‌ను మరిగి ఏ రాత్రికో యిల్లు చేరతాడు. అదేమంటే కుముదాన్ని చితక తంతాడు.

హేమ తీసుకోవాల్సిన ఇంజక్షన్ల కోర్సు పూర్తయింది. అయితే అంతటితో వదలలేదామెను గోపాలకృష్ణ.

"కాల్షియం ఇంజక్షన్లు తీసుకోండి కొన్నాళ్లపాటు హాయిగా ఉంటుంది. ఆఫీసులో టైపు కొట్టీ కొట్టీ అలసిపోయి ఉంటారు కాబట్టి" అన్నాడు హేమ చూపులతో తన చూపులు ముడివేసి.

తన బుట్టలో పడింది పిట్ట అని యీ పదిహేను రోజుల్లో హేమను గమనించిన గోపాలకృష్ణ అనుకుని కర్టెన్ వెనుక రూమ్‌లోకి పిల్చాడు ఆమెను. పాతికేళ్లు దాటినా పెళ్లిగాని హేమ ఆ సుందరాంగుడి పట్ల ఆకర్షణకు లోనుకావటం ఎంతో కాలం పట్టలేదని తనకు తానే తెలుసుకున్నది.

లోపలకెళ్లగానే గోడ కెదురుగా నిలబడి నవ్వుతూ రెండు చేతులూ చాచాడు డాక్టర్ గోపాలకృష్ణ, యిన్నాళ్లూ హేమను గమనించాడు కనుక. అంటే హేమ యిక్కడకు వచ్చేటప్పుడు ప్రత్యేకంగా అలంకరించు కోవటం, వగైరాలన్నీ చూసి.

రివ్వున వెళ్లి గువ్వలా అతని చేతుల్లో ఒదిగిపోయింది హేమ. వళ్లంతా వెచ్చని

ఆవిరులు. హాయిగా అన్పించింది.

"ఏయ్! యింక వదులు. ఇంజక్షన్ తీసుకోవద్దూ..." అంటూ బలవంతంగా హేమను విడిపించుకుని వచ్చి, పొడుగు బల్లపై కూర్చుని నెమ్మదిగా నరానికి కాల్షియం ఇంజక్షన్ చేయటం మొదలెట్టాడు గోపాలకృష్ణ. అతని కౌగిలికంటే వెచ్చగా హాయిగా అన్పించిందా ఇంజక్షన్ హేమకు.

అలా రోజూ వచ్చి కాల్షియం ఇంజక్షన్ తీసుకునేది హేమ.

జీతం తీసుకోగానే అతను చెప్పినంత డబ్బూ చెల్లించేది.

క్లినిక్‌కు ఆనుకుని అవతలగా చిన్న నర్సింగ్‌హోమ్ ఉందతనికి. క్లినిక్‌కు ఉదయం తొమ్మిదింటికి వచ్చి మధ్యాహ్నం ఒంటిగంట దాకా ఉంటాడు.

మళ్లీ సాయంత్రం ఐదింటికి వచ్చి రాత్రి ఎనిమిది దాకా ఉంటాడు. ముఖ్యమైన కేసులకి స్పెషలిస్టులను పిలుస్తాడు. డ్యూటీ డాక్టర్లూ, సిస్టర్స్ రోగులను కనిపెట్టుకుని ఉంటారు.

ఇల్లు కూడా ప్రక్కనే ఎనిమిది మంది పిల్లలకు తండ్రయాడు. డాక్టరు కదా! భార్యకు నార్మల్ డెలివరీలయేట్టుగానే జాగ్రత్తపడ్డాడు. డబ్బు కోసం రోగులకు సిజేరియన్ ఆపరేషన్లని సజెస్ట్ చేస్తాడు. మందులు కూడా ఖరీదైనవే రాస్తాడు పెద్దలిస్టు.

ఒకరోజు హేమ వెళ్లేసర్కి చిన్న పొడుగు బల్లకు ప్రక్కగా ఉండి పేషెంట్‌ను పడుకోబెట్టి పిరుదలకు ఇంజక్షన్ చేసే పెద్ద బల్ల మీద పగిలిన గాజు ముక్కలూ, నలిగిన పూలూ కన్పించాయి. ఆరోజెందుకో ఐదు గంటలకే వెళ్లింది హేమ. మరో రోజూ అలాగే వెళ్లింది. బయట కాంపౌండర్ డాక్టర్ గారింకా రాలేదని వారిస్తున్నా వినకుండా లోపలకెళ్లి కూర్చుంది.

కర్టెన్ గది లోపల నవ్వులూ. మూలుగులూ ఆ 'పని' కూడా జరిపిస్తాడన్నమాట డాక్టరు యిష్టపడేవాళ్లంటే అనుకున్నది హేమ. తనిష్టమైతే ఐదులోపల కూడా వస్తాడన్నమాట.

ఒక్కో రోజు హేమ వెళ్లగానే డాక్టర్ పక్కన స్టూల్ మీద ఎవరో ఒకరు కూర్చుని ఉండేవారు.

"నువ్వెళ్ళు.....నే తర్వాత వెళ్తాను" అనేవాళ్లు హేమతో. హేమకు తెలుసు ఎందుకో? డాక్టరు చిలిపి చేష్టల కోసం వాళ్లు తహతహలాడిపోతున్నారనీ, తనెళ్తే అడ్డం తొలగిపోతుందనీనూ. అదంతా యీర్ష్యగా అన్పించేది హేమకు.

హేమ తల్లి రోగాన పడ్డది. తరచుగా ఈ నర్సింగ్‌హోమ్‌లోనే చేర్పించేది హేమ. డాక్టర్ గోపాలకృష్ణ మత్తులో పూర్తిగా తలమునకలయిపోయి ఉన్నదామె యిప్పుడు. ఈ రకంగానైనా అంటే తల్లి మూలకంగా అతన్ని చూడొచ్చని ఉబలాట పడుతుండేది.

తననే కాకుండా కాస్త కంటికి నదురుగా కన్పించే వాళ్లందర్నీ డాక్టర్ గోపాలకృష్ణ ఊరికే చూస్తుంటాడనీ, అవతలివాళ్లు తనలాగే అతన్ని మొహం వాచినట్లు చూస్తుంటారనీ అర్థం చేసుకొన్నది హేమ. అతనికిష్టమైన వాళ్లు రోగం పేరుతో ఆ నర్సింగ్ హోమ్‌లో నెలల తరబడి తిష్టవేస్తుంటారని కూడా గమనించింది హేమ. వాళ్ళకూ కాల్షియం ఇంజక్షన్లు యిస్తాడని తెలుసుకున్నదామె.

ప్రక్కన డ్యూటీ డాక్టర్లూ, నర్సులూ, దాయాలూ ఉన్నాసరే రౌండ్స్ కొచ్చినప్పుడు తన కిష్టమైన వాళ్ల రూమ్‌లో కెళ్లి తలుపేసుకునేవాడు డాక్టర్ గోపాలకృష్ణ. మిగతా వాళ్లకు తెల్సు కాబట్టి నోళ్లు తెరుచుకుని అలా నిలబడి ఉండేవారు. అతను బయటకొచ్చేవరకూ చూస్తూ, ఎవరేం అడగగలరు అతన్ని. వాళ్లు నాకు తెల్సు, వాళ్ల ఫ్యామిలీ విషయాలేవో మాట్లాడుతుంటే ఆలస్యమైంది అనేవాడు. డాక్టర్లను-అనుమానిస్తే తప్పన్నట్లు మాట్లాడగలడు అతనని గ్రహించుకుంది కూడా హేమ, యిన్నాళ్ల పరిచయంలో అతని తత్వం అర్థమైంది కాబట్టి.

అయితే అతన్ని చూడందే బ్రతకలేని స్థితికి వచ్చింది. నిద్ర, ఆహారం సరిగా లేక మానసికమైన దిగులుతో మెదడులో ఎన్నో మార్పులొచ్చి ఊరికే కళ్లు తిరిగి పడిపోవటం మొదలైంది హేమకు. స్ట్రెచర్‌పై తీసికెళ్లేవాళ్లు దాయాలు డాక్టర్ వద్దకు అలాంటప్పుడు ఆరోగ్యంగా ఉంటే వలవేస్తాడు కానీ, అనారోగ్యపు గోలేమిటి? అని అసహ్యం అతనికీ. ఈ జిడ్డుది నన్నొదిలేలా లేదని గ్రహించుకుని చూసీ చూడనట్లుండేవాడు. కూతురికిదేంవింత జబ్బోనని రాధమ్మ ఊరికే పోరుతుంటే స్పెషలిస్ట్‌కు చూపించే ఏర్పాట్లు చేయించాడు గోపాలకృష్ణ. బ్రెయిన్ స్కానింగ్ చేయించారు. ఎన్నో టెస్ట్‌లు చేశారు. చివరకు ఆ కళ్లు తిరిగి పడే రోగం తగ్గాలంటే (డిప్రెషన్‌కు గురయింది కాబట్టి) కొన్నేళ్లపాటు యాంటీ డిప్రెసెంట్స్ వాడాల్సిందేననే నిర్ణయానికి వచ్చారు డాక్టర్లు. స్పెషలిస్ట్‌తో చీటికీ మాటికీ రావద్దనికూడా చెప్పించాడు హేమకు. కొంత వరకు కోలుకున్నా అతని పిచ్చి నుండి బయటపడలేకపోతుంది. కాల్షియం ఇంజక్షన్ పేరుతో ఎంతమంది తనలాంటి అమాయకులను ఆకట్టుకున్నాడో గదా! అని నవ్వొంచేది. ఆ పిచ్చిలో ఆడవాళ్లు అతని మొహాన ఎంతెంత మొత్తంలో ఫీజులూ, ప్రేమతో ఖరీదైన కానుకలూ శక్తికి మించి యిచ్చారో కూడా హేమకు తెల్సు.

ఆడవాళ్లను ఆకట్టుకుని దండిగా డబ్బులు దండుకోవడం కోసం తన నర్సింగ్ హోమ్ చుట్టూ క్లినిక్ చుట్టూ తిప్పుకుంటాడు డాక్టర్ గోపాలకృష్ణ. భర్తతో విసిగిపోయిన కుముదం కూడా ఏ మధ్యాహ్నాలప్పుడో, అతని ఒడిలో సేదతీరి తృప్తిగా వెళ్తుంది. లేడీ మెడికోలు కూడా అబార్షన్‌ల కోసం వచ్చేవారనే నిజం కూడా బోధపడింది హేమకు.

తల్లికి మరోసారి బాగాలేకపోతే ఆ నర్సింగ్‌హోమ్‌లోనే అడ్మిట్ చేయించింది హేమ.

డ్యూటీలో ఉన్న సిస్టర్ దగ్గర కూర్చుందొక రోజు. ఆ సిస్టర్‌కు డాక్టర్ గోపాలకృష్ణంటే అంతగా సద్భావం లేనట్టుంది. "ఆ ఏవుందిలెండి. అందరూ గొప్పగా అనుకునేలా చల్లగా రోగుల్ని చూసేవాడిగా చిత్రించుకున్నాడు తనను తాను. బీదవాళ్లను అట్లా చేతితో కూడా తాకడు. బిల్స్ తక్కువ వేయించినట్లు చేస్తాడు. అంటే ముందు ఎక్కువ వేసి పేషెంట్ వాళ్ల ముందు నాల్గయిదు వందలు తగ్గించినట్లు చేయటం పేషెంట్లను కొందర్ని వాళ్లతోవచ్చే ఆడవాళ్లనూ కళ్లల్లోకి చూసి నవ్వుతూ ఆకట్టుకుని ఆ ఆకర్షణలో తన నర్సింగ్‌హోమ్ చుట్టూ దీపం చుట్టూ తిరిగే శలభాల్లా తిప్పుకుని డబ్బు గడించటం, అవసరమున్నా లేకున్నా సెలైన్ బాటిల్స్ ఎక్కించటం, మందులకు బదులు ఇంజక్షన్స్ చేయడం, తను వ్రాసిన షాపులోనే మందులు కొనుక్కోమనడం, స్కానింగ్‌లూ, ఎక్స్‌రేలూ తను చెప్పిన చోటనే కమీషన్ కోసం చేయించుకోమనటం, వేరే వాళ్లు వ్రాసినవి పనికిరావని తను వ్రాయడం...... ఎందుకంటే ఒక డాక్టరు వ్రాసినది యింకొకళ్లొద్దంటారు. యిది అన్ని రంగాల్లో ఉండే అసహ్యకరమైన పద్ధతే. ఇలా ఎన్నో చేస్తుంటాడు. పల్లెటూరి జనం నమ్మాల్సిందే అతన్ని మంచివాడని. బాగా తెల్సిన వాళ్లెవరూ నమ్మరు ఇతని చేష్టల్ని. ఇలాంటి వారు మానవతా విలువలదృష్టితో ఆలోచిస్తే డాక్టర్ల వృత్తికే కళంకం తెచ్చే రకాలు ...." అంటూ చెప్పుకొచ్చింది.

అతని 'ప్రేమ మత్తు' మందులతో వదలుతోన్న హేమకు తల తిరిగినట్లయింది నర్సు మాటలకు. అయితే మాత్రమేం లాభం? జన్మంతా మందులు మింగే మానసిక వ్యాధికి బలయింది తను డాక్టర్ గోపాలకృష్ణ వల్ల. ఇలా తనేనా? తనకు తెలీని యింకా ఎంతో మందా! అధిక సంపాదన కోసం పుష్పంలోని మకరందం కోసం తిరిగే భ్రమరంలా సీతాకోక చిలుకల్లాంటి ఆడవాళ్లను తన చుట్టూ తిప్పుకునే డాక్టర్ గోపాలకృష్ణదా తప్పు! అతని అందానికి బానిసలై ప్రేమ అనే ఆకర్షణకు లోనై మతులు పోగొట్టుకునే తనలాంటి వాళ్లదా! తప్పు! ఇది మాత్రం అర్థంకాని ప్రశ్నే నాకంటూ తల పట్టుకుకూర్చుండి పోయింది హేమలత, అతని మోజులో ఎప్పటికీ, పెళ్లి చేసుకోకూడదని నిశ్చయించుకున్న పిచ్చి హేమలత, ప్రేమంటే హేమలతదే. కానీ డాక్టర్ గోపాలకృష్ణకు మాత్రం ఆడవాళ్లను ఆకర్షింపచేసుకోవటం తన వశం చేసుకోవటం అతని దృష్టిలో అందమైన అనుభవం మాత్రమే. ●

*(మయూరి వీక్లీ, తే. 1.12.95)*



# లేడీస్ యాత్రా స్పెషల్

జై మహిళా సంఘం వారి దక్షిణ యాత్రా స్పెషల్ బస్ ఒక శుభముహూర్తాన యాభైమంది మహిళలతో బయల్దేరింది. అందులో నేనొక్కడ్నే మగపురుగును. అది కూడా మా ఆవిడ అతి తెలివి తేటల వల్ల ఇంక్లూడ్ అయింది నా పేరు. అంటే మగవాడు ఒకడుంటే అన్ని పన్లకూ పనికొస్తాడని.

ఎంత స్త్రీవాద ఉద్యమాలు చేపట్టినా, వేదికలెక్కి ఊకదంపుడు ఉపన్యాసాలు దంచినా ఆడవాళ్లందరూ ఒప్పుకుని తీరాల్సిన విషయం మగతోడుండాలనేది.

పైగా తెలీకుండా మీ పేరుతో టిక్కెట్ బుక్ అయిందని చెప్పింది నాతో. అంతమంది ఆడ తండా ముందు చుక్కల్లో చంద్రుడిలా ఉంటావని పొగిడింది నేను రానని గొడవ పడుతుంటే.

మధ్యాహ్న భోజనాల సమయమైంది. ఆడ గుంపంతా తమకేమీ పట్టనట్లున్నారు. ఆకలికుండలేని నేను డ్రైవరు సాయంతో వంట సామాగ్రి అంతా దించాను బస్‌పైనుండి.

"నీళ్లు తేండి, వాటితోనే ఉందంతా" అంటూ గదిమింది నన్ను మా ఆవిడ కనకం.

వాళ్లందరి ముందూ అలా గదిమేసరికి అవమానంగా అనిపించిందెందుకో నాకు. నీళ్ల పంపు కోసం వేట మొదలెట్టాను. చాలా దూరంగా ఉన్న ప్రాంతంలో పట్టుకోగలిగాను ఎలాగో, అక్కడినుంచి అంత మందికి తాగడానికీ, వంటకూ ఎన్నో బిందెల నీళ్లు తెచ్చీ తెచ్చీ భుజాలు, చేతులూ లాగటం మొదలు పెట్టి ఇహ లాభం లేక ఒక చోట కూలబడ్డాను.

నేను డ్రైవ్ చేయటానికే తప్ప ఇలాంటి అడ్డమైన పన్లన్నీ చేయటానికి మీరేం డబ్బులెక్కువ ఇవ్వలేదు నాకు, ఇచ్చినా చేయనని డ్రైవర్ తప్పించుకున్నాడు. క్లీనర్ డిటోనే.

బోజనాలు కానిచ్చి, మళ్లీ బయలుదేరాం. రెండు, మూడు పుణ్యక్షేత్రాలు దర్శించిన తర్వాత, ఈ రోజో రేపో చచ్చేలా ఉండి, వద్దన్నా వచ్చిన ముసలమ్మ ప్రాణం అటో ఇటోగా ఉంది.

"త్వరగా మీరెళ్లి టెలిగ్రాం ఇచ్చిరండి" అంటూ పురమాయించింది మా ఆవిడ, జీతం బత్తెం లేకుండా తేరగా దొరికిన మొగుణ్ణి కాబట్టి. నేను కట్నం కూడా పుచ్చుకోలేదు మరి.

టెలిగ్రాం ఇచ్చాను ముసలమ్మ తరపువాళ్లంతా వచ్చారు. ఆవిడ ప్రాణం వాళ్లను చూసిన తర్వాత గుటుక్కుమంది తృప్తిగా.

అంత్యక్రియలూ, వగైరాలయ్యేసరికి దాదాపు కొన్ని రోజులు పట్టింది. అంటేఆసుపత్రిలో చేర్చి, ఉండిన కాలంతో పాటు. "సాంబమూర్తిగారూ! మీ మేలు మరువలేమండి!" అని కితాబు ఇచ్చెళ్లారు ముసలమ్మ తరపు బంధువర్గం, బ్రాహ్మణుడ్ని అవటం వల్ల. కొన్ని చాదస్తాలు పాటించటంతో నాకు కొద్దిగా నలతగా అనిపించింది.

మరికొన్ని యాత్రలయ్యాక మరొక ముసలావిడ జబ్బున పడ్డది. ఆవిడను ఆసుపత్రిలో చేర్పించి, తగ్గేదాకా ఉండడంతో మరికొన్ని రోజులు ఆలస్యమైంది మా ప్రయాణం.

ఒక రాత్రి మా బస్ ప్రయాణిస్తూ ఉంది. వెనుక నుండి ఫుల్‌లోడ్‌తో ఉన్న లారీ వచ్చి మా బస్‌ను గుద్దింది. ఆ డ్రైవర్ కూడా అదే లోడ్‌లో ఉండుంటాడు. ఇంకేముంది? ఒక వేళ పోయినా ఫరవాలేదని తెచ్చుకున్న సత్తు సామాగ్రి అంతా బలాబలామంటూ కిందికి దొర్లాయి. ఈ లోపల ఆ లారీ ఉడాయించేసింది.

"అలా గుడ్లు మిటకరించి చూస్తూ నిలబడతారేం? అవన్నీ ఒక చోట పెట్టి కాస్త సరిచేయండని" ఆర్డర్ వేసింది మా ఆవిడ కనకం.

"మొగుడు ముండా అంటే ముష్టికొచ్చినోడు ముండా" అన్నట్లు (ఇక్కడ దానర్థం తల క్రిందులైంది) మా ఆవిడే అందర్లో అలా నా పరువు తీస్తుంటే మిగతా ఆడ మలయాళం కూడా నాకేమీ సాయం చేయకపోగా పోచికోలు కబుర్లలో పడ్డారు.

తెల్లారి షాపులు తీసే టైమయ్యేదాకా ఉండి, ఊళ్లోకెళ్లి, సుత్తి, వగైరా కొనుక్కొచ్చి ఒక్కొక్క పాత్రనూ సొట్టలు తీయటం మొదలెట్టాను. పేవ్‌మెంట్ మీద కూర్చుని నేనెవరో పాత సామాన్లు బాగుచేసే వాడ్ననుకుని, ఐదారుగురు మావీ ఇస్తాం, ఎంత తీసుకుంటారు? అవి అడగడం మొదలెట్టారు.

నిద్రలేక, చింపిరి జుట్టు అవతారంతో ఉన్న నేను నా బతుకు ఇలా అయిందా చివరకు అనుకుంటూ మనసులో కుమిలి కుమిలి ఏడ్చాను.

అమర్నాడు ఆ ఊళ్లో మంచిమంచి చూడదగ్గ ప్రదేశాలున్నాయంటే రామదండులా ఉన్న ఆ ఆడమూకనేసుకుని బయలు దేరాను. మధ్యలో నడవలేని ముసలమ్మలనూ నేను నడిపించుకు పోవటం.... ఆ అవస్థ చెప్పలేనిది. పైకి అని బ్రతకలేని స్థితి. మా కనకం పేరుకు తగ్గది కాదు. కంచులా మ్రోగే గంప గయ్యాళి.

కొన్ని చోట్ల ఔటర్ స్టేట్‌కు అనుమతి తీసుకుకోకపోతేనూ, టోల్‌గేట్ టాక్స్ వసూలు దగ్గరా ఎన్నో తంటాలు పడ్డాను నేను.

అన్ని చోట్లా నా భార్య కనీసం ఒక మనిషిని చూసినట్లు కూడా మాడలేదు నన్ను. యంత్రంలా చూసింది. అన్నింటికీ ఉపయోగించుకుంది.

కొందరు భర్తలు ఈ ఆడవాళ్ల సంగతి తెలిసే ఈ యాత్రకు వచ్చి ఉండరనిపించింది. పొరపాటు జరిగిందని చెప్పి మా గయ్యాళి కనకమే నాకూ టికెట్ తీయించుంటుంది. సర్వం నాతో ఊడిగం చేయించుకోటానికి, మహిళా సంఘంలోని తన స్నేహితురాండ్రకు అడుగులకు మడుగుత్తొత్తటానికి, యాత్ర ముగిసినా నేను నెలదాకా కోలుకోలేకపోయాను. ఆరోగ్యం పాడైపోగా, సెలవూ ఖర్చయింది.

ఈ అనుభవంతో "జై మహిళా సంఘం వారి ఉత్తరయాత్ర"కు మాత్రం వెళ్లకూడదని గట్టిగా నిశ్చయించుకున్నాను. అంతగా కనకం పట్టుపడితే "నీ దారి నువ్వు చూసుకో" అనే నిర్ణయానికి కూడా వచ్చేలా చేసిన దక్షిణ దేశ యాత్రానుభవాలు గుర్తొచ్చి.

*( ఆంధ్రప్రభ, తేది : 21.11.96)*



# అమ్మో! (ప)రేషన్ షాప్.......!

"నిల్చుని, నిల్చుని కాళ్లు లాగుతున్నాయి. మొన్నకూడా నాదాకా వచ్చింతర్వాత ఐపోయింది. ఆఫీసులో నెలలో ఇన్నాళ్లు పర్మిషన్ అడగాలంటే నాకుమాత్రం మొహం చెల్లొద్దూ" అంటున్నాడు, క్యూలో నా వెనక నిల్చున్న తను స్వగతంగా.

అవి నా చెవిన పడ్డాయి. నే నసలు నిల్చోలేను అనారోగ్య కారణంగా, ఎడం కాలు బాగా తిమ్మిరెక్కిపోతున్నది. కార్డుల్లేని వాళ్లను ఏరిపారేయకుండా డబుల్‌రేట్ తీసుకుని డీలర్ కిరోసిన్ పోస్తున్నాడు. ఆ పోసేవాడు వాడి సొంత సొమ్మిస్తున్నట్లు బూతులు తిడుతూ, విదిలిస్తూ పోస్తున్నాడు. ఏమైనా అంటే వాళ్లకు కోపం వచ్చి పోయకపోతే తమ గతేంకానని అనుకున్నవాళ్లు లోలోపల కుంగిపోతున్నారు.

కోనసీమ 'శ్మశానసీమ' అయి వాళ్లేడుస్తుంటే, అక్కడికి సప్లయ్ చేస్తున్నామనే వంకతో వీళ్లు కిరోసిన్ దొరకలేదంటూ బ్లాక్‌లో అమ్ముకుంటూ కార్డున్న వాళ్లకు పోయక, రేపురా, మాపురా! అని తిప్పి పంపటాలూ నా చెవిన బాగా పడ్డాయి ఈ మధ్య కాలంలో.

"పామొలిన్, చక్కెర ఉంచుకునీ లేదంటారు. ఇహ బియ్యమైతే మంచివొస్తే మన దాకా రానివ్వరు. కార్డులమీద బియ్యం తీసుకోని వాళ్ల కోటాలోవి బ్లాక్‌లో అమ్ముకుని సొమ్ము చేసుకుంటున్నారు డీలర్లు. అయినా కార్లలో వచ్చే వాళ్లకేం మాయరోగమండీ, కుక్కలకు, పనిమనుషులకూ ఈ చవుక బియ్యం తీసుకెళ్లడానికి. వాళ్లు కూడా ఇలాంటి వాటి కెగబడితే మాలాంటి వాళ్ల గతి ఎలా ఉంటుందో చూడండి" అన్నాడో పండు ముదుసలి.

కాళ్లు అటూ, ఇటూ మార్చుకుంటూ ఎంతో అవస్థ పడుతున్నాడతను నిల్చోలేక. చిన్నవాళ్లు కూడా ఈ పొల్యూటెడ్ గాలీ, కల్తీ ఆహారం భుజిస్తున్నవారు కాబట్టి అతనిలానే ఆపసోపాలు పడుతున్నారు నిల్చోటానికి.

"అన్ని షాపులవాళ్లు మోసగాళ్లేనండీ. బట్టలపై రేటెక్కువేసి, మనకు తగ్గించినట్లు చేసి, మనకంటి తుడుపుకోసం మనమడిగిన రేటు కిచ్చినట్లు నాటకమాడతారు. నేను ప్రత్యక్షంగా విన్నానొకసారి - బేరాలాడే మోటుగా ఉండే ఆడవాళ్లను దుకాణంలోని గుమస్తాలు చాటుగా బూతుమాటల్లో విమర్శించడాన్ని" అన్నాడు నా ముందు నిల్చున్నతను.

క్యూలో సరిగా నిల్చోటం మనకలవాటు కాదు కాబట్టి వంకరటింకర క్యూలో పక్కగా వెళ్లిన వాళ్లలో ఒక వయసు మళ్లినామె ఈ మాటలన్నీ వింటూ"మొన్నామధ్య కోఠిలో షాపింగ్ చేస్తూ ఒక బాటా షాపులోకెళ్ళి ముఖమల్ చెప్పులు కావాలన్నాను. రేటు అరవై అయిదు చెప్పాడు. సరేనని ఆ చెప్పుల్తోనే డబ్బు చెల్లించడానికి ఐదారు అడుగుల దూరంలో ఉన్న కౌంటర్‌వద్ద కెళ్లాను. అవి అరవైఐదు కాదు, ఎనభై అయిదని ఆ షాపు మేనేజరూ, చెప్పులు చూపించినవాడూ నాకు పదిహేను రూపాయలు వాపసిచ్చి

దబాయించడం మొదలెట్టారు. మరీ ఇంత పచ్చి అబద్ధమా! వ్యాపారమంటేనే అబద్ధాలూ, మాయలూ, మర్మాలూ కదా! నా డబ్బు నాకిచ్చేయండి. మీ చెప్పులు తీసుకుని అని అన్నాను. ఇంతసేపూ మీ కాళ్లకున్నాయ్. మేం తీసుకోమన్నారు. ఏం చేయలేక ఒళ్లుమండి ఆ చెప్పులూ, డబ్బులూ మీరే ఉంచుకోండంటూ వచ్చేశాను - చెరువు మీద అలిగి ముడ్డి కడుక్కోని చందంగా. పక్కనే మరో బాటాషాపులో అడిగితే అవే చెప్పులు అరవైఐదు చెప్పారు. మళ్లీ వచ్చి వీళ్లకు చెప్పి కాళ్లా వేళ్లా పడి బ్రతిమిలాడినా పోలీసులకు చెప్తానని బెదిరించినా వాళ్లు ఒప్పుకోలేదు. ఎంత పచ్చిమోసమో చూశారా? తూకాల్లో తప్పులు, కల్తీలు. ఎక్కడ చూసినా అవినీతే తామరవ్యాధిలా...." అని చెప్పి అయాసపడిపోయింది. అందరం విని భారంగా నిట్టూర్చాం, చేతయింది అదే కాబట్టి.

"కార్డుల్లేని వాళ్లనేరేయండి. క్యూ కొంత తగ్గుతుంది" అని అరిచాను నేను అసహనంగా.

ఆ డీలర్‌కానీ, కిరోసిన్ పోసేవాడు కానీ, అక్కడున్న మరో ఇద్దరు పనివాళ్లు కానీ ఇవేవీ పట్టించుకోలేదు. వాళ్ల పని వాళ్లు చేసుకుపోతున్నారు. ఇక నిల్చోవడం నా వల్లకాలేదు. ఆ క్యూలో నాక్కాస్త ముందున్న ఓ కుర్రాడిని నా డబ్బా ఉన్న సంచీ పట్టుకోమని డీలర్ ముందున్న గట్టు మీద కూర్చున్నారు. నా స్థాయి వ్యక్తి ఈ క్యూలో నిల్చోటాన్ని ఎవరన్నా చూస్తారేమోననే బాధకూడా లేదు. నిస్త్రాణగా ఉంది. అయినా నా ధ్యేయం వేరుకదా!

"అక్కణ్ణుంచి ముందులే. వాళ్లంతా నిల్చోలే. నీవేం ఎక్కువ!" అని దబాయించాడు నన్ను డీలరు, అతని పక్కనున్న అతని ఫ్రెండూ గొడ్డును విదిలించినట్లుగా.

ఇంతలో నా వంతొచ్చింది. 'డబ్బామూత తెరు. బడితెలా గట్టనిల్చున్నవేంది? నీ యవ్వ..' అంటూ కిరోసిన్ పోసేవాడు కూశాడు అసభ్యంగా. డీలర్‌వాళ్లు పగలబడి నవ్వడం మొదలెట్టారు. రేషన్ షాపులవాళ్ల అవినీతి లీలలు వినీ వినీ అంత పెద్దహోదాలో ఉన్న నేను ఈ అసభ్య రీతుల్ని భరించలేకపోయానిక. కళ్లలో నిప్పులు కురిపిస్తూ రేషన్ షాపు డీలర్ ముందు నిలబడ్డాను ఠీవిగా.

ఆ క్యూలోనే ఎవరికీ తెలీకుండా సివిల్ డ్రస్‌లో ఒక సంచితో కిరోసిన్ డబ్బా, బేడీలతో రెడీగా ఉన్న కానిస్టేబుల్‌ను పిల్చి "అహ్మద్! అరెస్ట్ హిమ్" అని అంటూ నా ఐడెంటిటీ కార్డు చూపాను డీలర్‌కు. అతను పాలిపోయిన మొహంతో "మిసెస్ శారద, చీఫ్ రేషనింగ్ ఆఫీసర్" అని ఉన్నది చదివి నా కాళ్లపై సాష్టాంగపడ్డాడు.

నేను జాలిపడదల్చుకోలేదు. రేషన్ షాపుల్లో జరిగే అక్రమాలకు ప్రతీకలాంటి అతన్ని విడిస్తే మరికొన్ని చోట్ల ఇంకెన్నో అవి నీతి పనులు జరగడానికి అవకాశమిచ్చిన దాన్ని అవుతానుకాబట్టి.

(ఆంధ్రప్రభ తేది. 16.10.96)

## "సంగీతమూ-వ్యాపారధోరణీ"

**మా** నాన్నగారు ఏభైయేండ్ల క్రిందట మహాలక్ష్మి అమ్మవారిపై పాటలు వ్రాసి, బాణీలు కట్టి వాటిని ఒక పుస్తకరూపంలో అచ్చువేయించారట.

మానాన్న చీమకైనా అపకారం తలపెట్టని మహామనిషి కావటంతో అందరూ తనలాగే మంచివారని నమ్మేవారు.

ఆ నమ్మకాన్ని వమ్ముచేస్తూ ఆయన గతించిన మూడవరోజే చిన్నపిల్లలైన మమ్మల్ని, మా అమ్మనూ వేరే పండుకుతినమన్నారు మా దాయాదులు. మా వద్ద ఏమీ లేకపోవటంతో పుణ్యాత్ముడైన మా నాన్నగారి మంచితనం పెట్టని కోటలా మాకు అండగా నిల్చి, ఊరిపెద్దలు మమ్మల్ని ఆదుకునే స్థితికి తెచ్చింది.

చెంబులు, తప్పేలాలే కాకుండా తర్వాత మాకు మా నాన్న మా యిలవేల్పయిన మహాలక్ష్మి అమ్మవారిపై వ్రాసిన శతకం, పంచరత్నాలూ, పాటలూ, పురాతన గ్రంధాలూ ఏమీ దక్కనీయలేదు మా దాయాదులు.

★ ★ ★

కాలచక్రం గిర్రున తిరిగింది బొంగరంలా.

మా చదువులు పూర్తయ్యాయి మేనమామల సాయంతో. ఉద్యోగాల్లో స్థిరపడ్డాం. ఒక స్థిరత్వమేర్పడింతర్వాత మనలో నిబిడీకృతమై ఉన్న కళలను వెలుగులోకి తేవాలని ప్రయత్నిస్తాం సహజంగా.

నా తల్లిగార్నడిగి ఆమెకు గుర్తున్నంత వరకూ అన్ని పాటలనూ, ముందుగా ఒక క్యాసెట్‌లో యిద్దరం కలిసి పాడటం జరిగింది.

అర్కెస్ట్రాతో కలిపి,పాడి, క్యాసెట్‌ను మార్కెట్లో రిలీజ్ చేసి, నా తండ్రిగారి ప్రతిభను నల్గురికి తెలియజేసి పితృ రుణం తీర్చుకోవాలనే కోరిక కల్గింది. ఒక మంచి ఆలోచన వచ్చినప్పుడు కొన్ని యిబ్బందులైనా ఎదుర్కొని దానిని వెంటనే ఆచరణలో పెట్టాలన్న మనస్తత్వం నాది. వాయిదా వేసుకునే బద్ధకం నాలో అణుమాత్రమూ లేదు.

ఈ పనిలో భాగంగానే నేనెప్పుడూ క్యాసెట్స్‌కోనే షాపతని వద్దకు వెళ్లి "మీకెవరైనా మ్యూజిషియన్ తెలిస్తే చెప్పండి. నేనిలా క్యాసెట్టొకటి చేయిద్దామనుకుంటున్నాను" అని వివరించాను.

:

"మీరు రేపు రండి సుందరం అనే నా స్నేహితుడు అమీర్‌పేటలో ఉన్నాడు అతను చేస్తాడు" అన్చెప్పాడు.

మర్నాడు నా సోదరుడూ, నేనూ కల్సి ఆ షాపతనివద్దకెళ్లాం. అతను ముందే ఫోన్ చేసి, ఉంచాట్ట సుందరంగార్కి. వాళ్లింటికెళ్లాం ముగ్గురం.

"ఏదీ! ఏదైనా పాడి చూపండి. వాయిస్ ఎలా ఉందో, ఏ శృతిలో పాడుతున్నారో తెలుసుకుందాం" అన్నాడు సుందరం. యాభై ఏళ్లపైనే ఉన్నట్లుందతనికి.

అన్ని రకాల రిథమ్స్ ఉండే ఆర్గాన్ ముందు కూర్చుని నా శృతి చూసుకున్నాడు. కర్ణాటక సంగీతాన్కి సంబంధించి త్యాగరాజ కృతి "పలుకవదేమిరా......రామా..."లోని చిట్టస్వరం "పమరిసరీ...రిమపనిదనీ......." అంటూ పలికాను. ఘంటసాలగారి లలిత గీతం "పాడకే నా రాణి" కొద్దిగా ఆలపించాను.

"కంఠస్వరం అద్భుతంగా ఉంది" అని షాపతనూ, సుందరంగారి భార్యా ఒకేసారన్నారు.

"నేను రికార్డు చేయాలనుకున్న మా నాన్నగారు వ్రాసిన కొన్ని పాటలను ముందుగా ఒక క్యాసెట్‌లో పాడి యిస్తాను" అన్చెప్పాను. 'సరే' అని, 'మరి తబలా వాళ్ళకూ, వయొలిన్ వాళ్లకూ ఆటోలకదీ యివ్వాల్సొంటుంది. వాళ్లు సరిగా రారు, మీరొచ్చినటైంకు. కాఫీలూ, చాయ్‌లంటారు, మధ్యలో, ఇదంతా ఖర్చు. అడ్వాన్స్ కొంత యివ్వండి" అన్నాడు. ఇంకా "థియేటర్‌లో గంట కింతని వసూలు చేస్తారు. పదివేలదాకా అవుతుంది. సగం యివ్వండి. ఇంట్లోనే చేద్దాం. ఇక్కడే నేను చేసిన క్యాసెట్ పెడతా, వినండి" అని 'క్రిమినల్' సినిమాలోని *"తుమ్‌మిలే దిల్‌ఖిలే... ఔర్ జీనేకో క్యాచాహియే"* విన్పించాడు. బాగుందది.

"సరే. మీరెప్పుడు రమ్మంటే అప్పుడొస్తాం" అని వెయ్యి రూపాయలు అడ్వాన్స్ యిచ్చి వచ్చాం.

తంబుర బదులు నా వీణతో శ్రుతి వేసుకుంటూ ఒక్కొక్క చరణం రెండు సార్లు పాడుతూ రెండు వేపులా రికార్డ్ చేసి క్యాసెట్ యిచ్చాను.

వారమైంతర్వాత, రిహార్సల్స్‌కు రమ్మని వచ్చి చెప్పెళ్లారు సుందరం. ఆఫీసునుండొచ్చి, వెళ్లేదాన్ని. పరిచయ వాక్యాలతో కలిపి పది అయేలా ఎన్నుకున్నాను కదా! రెండు రోజులు రిహార్సల్స్ చేయించాడు ఆర్గాన్‌తోనే.

ఇవి సాంప్రదాయ భక్తి గీతాలు. అదేమో వెస్టర్న్ మ్యూజిక్‌కు సంబంధించిన ఆర్గాన్. కొన్ని మార్పులు ఆ తాళానికి సరిపోయేవి కావు.

"తీసెయ్యండవి" అనేవాడు మూర్ఖంగా, తీస్తే అర్ధం పోతుందనే యింగితజ్ఞానం లేదతనికన్పించింది నాకు.

తబలా, వయొలిన్ వాళ్లు రావటంలేదు. అడగట్నాన్కి మొహమాటం.

"ఎల్లుండి నుంచీ రికార్డింగ్ మొదలెడదాం" అన్నాడు. ఆ ఎల్లుండి రానే వచ్చింది.

పరిచయ వాక్యాలకు సన్నగా బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ ఉంటే బాగుంటుందని ముందు నేనెంత మొత్తుకున్నా అహంతో వినకుండా తర్వాత మాటలను డామినేట్ చేసేలా ఉన్న మ్యూజిక్‌ని తీసేసి మళ్లీ నేననుకున్నట్లయిందనిపించాడు.

తర్వాత నేను క్రమపద్ధతిలో ఎన్నుకున్న పాటల ప్రకారం మానాన్న నన్ను రాములవార్ని ఆశీర్వదించమంటూ వ్రాసిన మేలుకొలుపు ఐదారు సార్లు వాగించి చివరకు ఓ.కె. అయిందన్పించాడు. ఒక్కో రోజురాత్రి ఒంటిగంటయ్యేది. రికార్డింగ్ కెళ్ళొచ్చేసరికి. నిద్ర ఉండేది కాదు సరిగా. ఓకల్ కార్డ్స్ వీక్‌గా ఉన్నాయి, మాట్లాడటం కూడా నెమ్మదిగా ఉండాలని ఎన్నో జాగ్రత్తలు చెప్పారు నాకు క్రితంలో ఒక ఇ.ఎన్.టి. స్పెషలిస్ట్. అతనితో కూడా చెప్పాను. డబ్బు ముఖ్యం నా ఆరోగ్యమే మయితేనేం సుందరాన్కి!

నేనిచ్చిన క్యాసెట్ ప్రకారం ముందుగా పాటలకు మ్యూజిక్ కంపోజ్ చేసేవాడు కాదు. దానివల్ల ఎన్నోసార్లు పాడవలసి వచ్చేది. అతను సరైన ట్యూన్ కంపోజ్ చేసేవాడు కాదు. అదేమంటే రాత్రుళ్లు మేలుకుని చేస్తున్నానండీ అని అబద్దాలాడే వాడు. త్వరగా అయిపోతే దీనికి అయిదువేలా అని మేమనుకుంటామని అలా చేస్తున్నాడేమో అనన్పించింది నాకు.

ఎక్కడ ఆపాలో చెప్పేవాడు కాదు. దాంతో లయ తప్పుతుంది కదా! అలా చేయమని అడిగితే "నాకసలే టెన్షన్. అట్లా కష్టం" అనేవాడు. డబ్బిచ్చి దణ్ణంపెట్టాల్సిన పరిస్థితి నాకెదురైందిప్పుడు.

టి.విలో స్టేజ్‌పై పాడటం మనం చూడట్లేదూ! సంగీత దర్శకుడు చేతులూడిపోతాయేమో నన్నట్లు పాడేవాళ్లకూ ఆర్కెస్ట్రావాళ్లకూ చేతులూపటం చేయటం, తొందర స్వభావం కల్గిన నా సోదరుడు మిగిలిన నాలుగు వేలూ యిచ్చాడు వాళ్లు సగమే అడిగితే. ఈ తర్వాత నేను నా కున్న రెండు బంగారు గాజులూ అమ్మి నా సోదరుడి బాకీ తీర్చాను. డబ్బులన్నీ ముందే యిచ్చేసర్కి నన్ను రమ్మనటం, వాళ్లెక్కడికో వెళ్లటం తరచూ చేసేవాళ్లు.

"ఫోటో దిగండి. మ్యూజిక్‌కు నా పేరు ఉండాలి మీ నాన్నగారిది కాదు. మార్కెటింగ్ నా ఫ్రెండ్ (క్యాసెట్ షాపతను) చేసినట్లు పేరు ఉండాలి. నేను ఓ.కె. చేసింతర్వాత లేబుల్‌వి కాపీలు తీయించాలి" అన్నాడు దబాయింపుగా. అంటే అందులో కూడా కమీషన్ కొట్టాలనే ఉద్దేశం.

"మీ పేరు, అతనిపేరూ వేశాం. వేరే మాకు తెల్సినచోట. ప్రింటింగ్‌కు యిచ్చేశాం." అని గట్టిగా చెప్పాను. మెత్తగా ఉంటే యిహ లాభంలేదని. అప్పుడు గమ్మున ఉన్నాడు సుందరం.

"ఇవి అమ్ముడుపోవండీ! గుళ్లల్లో యిచ్చుకోవాల్సిందే మీరు" అంటూ నిరుత్సాహ పరిచాడు.

క్యాసెట్లూ తనే తెస్తానని యాభై రూపాయలవి ఎనభై అన్చెప్పి మూడు తెచ్చాడు అందులో కూడా కొంత కొట్టేసి. అది 'బి' వేపు రికార్డ్ చేస్తే వచ్చేది కాదు. నాసిరకంవి అన్నమాట అందుకు రెండు 'ఏ'లవేపు చేశాడు.

చివరరోజు స్వీట్లూ, పండ్లూ శాలువాతో సత్కరించాను. అతని భార్యకూ, కూతురికీ మంచి జాకెట్ పీస్‌లు పెట్టాను.

అంతా అయ్యేసర్కి నిద్రలేక ఎక్కువగా గొంతుకు శ్రమ యిచ్చి పేషెంట్లా తయారయ్యాను నేను.

"నేను పని మీద ఊరికెళుతున్నాను. మీరు క్యాసెట్స్ తీయించకండి. నాకు తెల్సిన వాళ్లవద్ద తీయిద్దాం" అని చెప్పాడు. అందులో కూడా వ్యాపార ధోరణే.

పాట పాటకూ కొద్దిగా గ్యాప్ యిచ్చి, మిగిలిన చోట రెండువేపులా మ్యూజిక్ పెట్టమన్నాను. ఖాళీగా ఉన్న టేప్‌లో. ఎందుకంటే చరణాలు ఒక్కసారే పాడించేసర్కి ఖాళీ వచ్చింది.

చివర చివర కార్డ్సు మీదే ఫాలో అయ్యాడు, ప్రత్యేకించి మ్యూజిక్ లేకుండా. ఇహ అతనిమీదనమ్మకంపోయి వేరేచోట మరో మాస్టర్ క్యాసెట్ చేయించి ఖాళీ ప్లేస్‌లో కర్నాటక సంగీతం పెట్టించి క్యాసెట్స్ తీయించాము. ఇప్పుడు తెల్సింది నాకు నాలుగుచోట్ల కనుక్కోవాలని. 'చేతులు కాలాక ఆకులు పట్టుకుని లాభమేముందని' అనుకున్నానిప్పుడు.

"మిమ్మల్ని మోసం చేశాడమ్మా యీ పాటలకు రెండు వేల కంటే ఎక్కువ కాదు. గొంతూ బొంగురుగా ఉంది. ఇంట్లో అయినా తలుపులూ, కిటికీలు వేసి చేయాల్సింది. అతనలా చేయలేదులా ఉందే?" అన్నారు ఆ క్యాసెట్లు తీసిన వాళ్లు.

భర్తనెక్కడ వల్లో వేసుకుంటారోనని ఊరికే తలుపులు తీస్తూ, వస్తూ ఉండేది సుందరం భార్య. వాళ్లిష్టమొచ్చినట్లు ఆషామాషీగా చేశారు.

ముందు తను ప్రిపేరవకుండా నన్ను వాగించి, వాగించి రికార్డ్ చేసేవాడయ్యే. అందుకే బొంగురుపోయినట్లుంది గొంతు.

"అబ్బే! అవి అమ్ముడుపోవండీ! మీరు చెబుతున్నారు కాబట్టి ఒకటి ఉంచండి. ఎవరికన్నా విన్పిస్తాను. "అని తీసుకున్నాడు. అమ్మేవాడిలాగా పేరు వేయించుకున్న షాపతను క్యాసెట్లు తీసికెళ్లినప్పుడు. కేస్ అప్పగించినందుకు సుందరం కొంత కమీషన్ యిచ్చుంటాడతనికి.

ఒకరోజు ఆఫీసు నుండి వస్తుంటే క్యాసెట్ షాప్‌లో సుందరం కూర్చుని ఉండటం చూశాను."ఏవండీ! చంద్రవేణిగారూ! లాభం వచ్చిందా? అమ్ముడయ్యాయా?" అన్నాడు.

"ఎలా వస్తుంది లాభం? మీకే ఐదువేలయ్యాయికదా! మీకివ్వగా గాజులమ్మిన డబ్బులు లేబుల్స్‌కు, క్యాసెట్స్ తీయించటానికి సరిపోయాయి. మీరు వయొలిన్, తబలాలు పెడతానని ఆర్గాన్ మీదే చేసి అంత వసూలు చేస్తిరి. ఇరవైదాకా అమ్ముతామని అంటిరి. అయినా అడిగారు కాబట్టి యిప్పుడంటున్నాను. నా సంస్కారం అడ్డొచ్చి, మధ్యలో తగ్గించమని మిమ్మల్ని అడగలేకపోయాను. మంచీ చెడూ మీ మనసుకు తెల్సుండాలి. ఖాళీచోట కనీసం మ్యూజిక్ కూడా పెట్టకుండా యిచ్చారు మీరు. మీ బిజినెస్ ధోరణి యిప్పుడర్థమైంది నాకు. ఆ క్యాసెట్ యిలా యివ్వండి" అని తీసుకుని వాళ్లిద్దరూ నోరు తెరుచుకుని చూస్తుంటే విసురుగా వచ్చేశాను.

ఇంటికొచ్చి చూద్దునుకదా! క్యాసెట్ మూతికి సీల్ వేసి ఉంది. ఎవరికీ విన్పించకుండా అలాగే ఉంచాడన్నమాట దిష్టిబొమ్మలా దాన్ని షాపులో, ఆ షాపతను. పవిత్రమైనది సంగీతం. అందులోనూ నావి భక్తి పాటలు. కొన్ని సినిమాలలో త్యాగరాజకృతులకు వెస్టరన్ మ్యూజిక్ జోడించి పాడినట్లున్నాయి నావి. దేముడూ సంగీతమూ విషయంలో కూడా వ్యాపార ధోరణేనా? సుందరంలాంటి వాళ్లే యీ కాలంలో ఎక్కువగా ఉన్నారు. 'ఈ కాలం ఎటు పోతోంది' అన్న విధాలా వ్యాపార దిశగానేనా? అని బుర్ర బద్దలు కొట్టుకోవటం మాత్రం నా వంతయిందిప్పుడు.

*(మయూరి వీక్లి. తేది. 9.5.97 )*

# కొవ్వొత్తి

స్కూటర్ మీద వెళ్ళే జంటల్ని, పరిసరాలతో తమకు సంబంధంలేనట్లు పార్కుల్లో సరస సల్లాపాల్లో మునిగిపోయిన ప్రేమికులను చూస్తుంటే "నా జీవితం ఎందుకిలా తగలడింది" అని ఎప్పుడూ బాధపడిపోతుంటుంది సుబ్బలక్ష్మి.

సుబ్బలక్ష్మి పధ్నాలుగో ఏట రజస్వలైంది. మైల ఎక్కువగా పోయి, జ్వరం వచ్చినట్లుండి, ఏమీ తినాలనిపించేది కాదు అలాంటప్పుడు.

"ఏం రోగమొచ్చిందే మాయదారి ముండా నీకు! ఏమీ తినిచావవు" అంటూ సుబ్బలక్ష్మి తల్లి నాంచారమ్మ కట్టెపేడు తీసుకుని కూతురిమీదకు విసిరేది (అప్పుడు దూరంగా కూచోబెడతారు కదా) బిడ్డ బాధను తల్లి మనసుతో అర్థం చేసుకోకుండా.

అది తగలరాని చోట తగులుతుందేమోననే భయంతో వణికిపోతూ చూసేది తల్లి వేపు సుబ్బలక్ష్మి.

ఐదో రోజు ఇంట్లో కొచ్చేటప్పుడు స్నానం చేయిస్తూ "తలమీద సరిగ్గా రుద్ది చావు. ముదనష్టపు ముండా. చేతుల్లో బలం లేక చస్తున్నావ్" అంటూ తలంతా మొట్టికాయలేస్తూ వీపుపై బాదేది. ఆ మానసిక, శారీరక బాధలకు సుబ్బలక్ష్మి కార్చే కన్నీళ్ళు స్నానం నీళ్ళలో కలిసిపోయేవి. వెక్కిళ్ళు పెట్టి, ఏడిస్తే లోపల కెళ్ళింతర్వాత నాంచారమ్మ రోకలి బండతో కొట్టేది కూతుర్ని.

పల్లెటూర్లో ఏ సరదాలూ లేక ఎప్పుడన్నా ఓ నవల స్నేహితురాలి వద్ద తెచ్చుకుని చదువుతుంటేనో, ఏదేనా పాటను కూనిరాగం తీస్తుంటేనో గబగబా వచ్చి జుట్టు పట్టుకుని లాగి లాగి కొట్టేది సుబ్బలక్ష్మిని నాంచారమ్మ.

తల్లి పెట్టే శారీరక బాధలు, తద్వారా మానసిక బాధలూ భరించీ, భరించీ సంతోషంగా వుంటే ఏం కొంపలంటుకుపోతాయోనన్న భావం ఆమెలో బలంగా నాటుకుపోయి నిర్లిప్తంగా వుండడం నేర్చుకుంది. ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్లుగా వుండేవి ఆమె చూపులు.

★ ★ ★

ఉద్యోగంలో చేరింది సుబ్బలక్ష్మి. రిటైరయిన తండ్రి, తన తర్వాత నలుగురు సంతానం. బాధ్యతంతా సుబ్బలక్ష్మిదే ఇప్పుడు.

కొడుకు ఒక్కడేనని వాడు చేసే వెధవ పన్లకు (సుబ్బలక్ష్మి పెట్టెలో జీతం డబ్బులు దొంగిలించడం, స్నేహితులతో సినిమాలు విచ్చలవిడిగా చూడడం, డిటెక్టివ్ నవలలు చదవటం, చదువులో ఫెయిల్ అవుతూ ఉండడంలాంటివి) నాంచారమ్మ వంత పాడటం, బాధ్యతల గురించి సుబ్బలక్ష్మి చెప్పబోతే చేతిలో ఏదుంటే అది తీసుకుని కూతురిపై విసరటం చేసేది. ఆ కొడుకూ అక్కమీద జాలి లేకపోగా కుళ్ళుమోత్తనంతో అక్కనే కొట్టేవాడు, చేతుల గాజులు పగిలేలా. అవి గుచ్చుకుని రక్తం కారుతున్నా వాళ్ళకు జాలి వుండేది కాదు సుబ్బలక్ష్మిపై. "మాకేం సొమ్ములు చేయించావే ముండా!" అని తల్లి కొడితే

తన రాళ్ళ కమ్మలు తల్లికిచ్చి యిత్తడి రింగులు కొనిపెట్టుకుంది సుబ్బలక్ష్మి.

★ ★ ★

"మా అమ్మాయా? ఉత్త తిరుగుబోతు ముండండీ! దాన్ని పెళ్ళి చేసుకుని మీ వాడేం సుఖపడతాడండీ! పైగా మీ వంశానికి పరువు తక్కువ కూడానూ" అని సుబ్బలక్ష్మి కొచ్చే పెళ్ళి సంబంధాలన్నింటినీ తిప్పి కొట్టేవాడు ఆమె తండ్రి. ఆ వున్న ఒక్క ఆధారం పోతే ఇంత మంది ఎలాగ గట్టెక్కగలరని అనుకుంటూ- తండ్రి అనే మాటకు కళంకం తెస్తూనూ. అంతమందిని కనేటప్పుడు తెలీదతనికి 'బాధ్యత' గురించి.

సుబ్బలక్ష్మికి ముప్ఫయిఐదేళ్ళొచ్చాయి. ఆమెను చేసుకోవాలని ఆమె మేనమామ ఆఫీసులో పనిచేసే టైపిస్టు రామకృష్ణ ఆమె తండ్రి చేస్తున్న ప్రచారాలు విని వుండీ ఆమె మేనమామ సీతారామయ్యను సంప్రదించి గుళ్ళో గుట్టు చప్పుడు కాకుండా ఒక శుభముహూర్తాన సుబ్బలక్ష్మిని పెళ్ళాడాడు.

★ ★ ★

సుబ్బలక్ష్మి కుటుంబం దిక్కులేనిదైంది. తల్లీ, తండ్రీ, చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ కాళ్ళావేళ్ళా పడ్డారు, మేమూ మీతోనే వుంటామంటూ. కొత్త పెళ్ళికూతురుగా కోర్కెలు చంపుకుని, రెడు రాత్రుళ్ళు ఏకధాటిగా ఏడ్చి, భర్తను ఒప్పించిందామె, తన వాళ్ళను తమతో వుండేలాగా రెండు గదుల ఇల్లు, చిన్న వంటగది. అందులో మోరీ, అంట్లు తోముకుం దుకు. మరో పెద్దగది.

"మీరిద్దరూ ఆ వంటగదిలో పడుకోండి మేమిక్కడ పడుకుంటాం" అని ఉక్రోషంగా అనేవాడు ఆమె తమ్ముడు వెంకట్రావు. అలాగే ఆ మురికి కూపంలోనే పడుకునేవారు సుబ్బలక్ష్మి ఆమె భర్తా.

కొత్త భార్యతో కోర్కెలు తీరకపోగా ఆమెను వాళ్ళు సతాయిస్తుంటే రామకృష్ణకు ఒళ్ళు మండేది. అతని తరఫువాళ్ళు ఆ తండాను వెళ్ళగొట్టమని అతని మీద వత్తిడి తెచ్చేవాళ్ళు. జీతం అంతా లాక్కోమని ఉసిగొల్పేవాళ్ళు.

ఎప్పుడైనా సుబ్బలక్ష్మి, రామకృష్ణా సరదాగా సినిమాకెళ్తే, నేనూ వస్తానని అంత పెద్ద తమ్ముడూ వాళ్ళ వెంట పడేవాడు. ఇంటికొచ్చింతర్వాత మొహాలు మాడ్చుకుని వుండేవాళ్ళు తల్లీ, తండ్రీ ఏదో కొంపలంటుకుపోయినట్లు వాళ్ళిద్దరూ పడుకుని ఉన్నప్పుడు కావాలని తలుపులు బాదేవాడు వెంకట్రావు. 'నేను కావాలో, నీవాళ్ళు కావాలో తేలిపోవాల్సిందే ఈ రోజు' అంటూ తన చెల్లెలు, బావా మాటలు విని పెద్ద రభస చేశాడు రామకృష్ణ ఒకరోజు.

"మేమెందుకులేమ్మా మీ సరదాల కడ్డంగా మిమ్మల్ని బాధపెడ్తూ. వెళ్ళిపోతాంలే నేరుగా" అంటూ దీర్ఘాలు తీసేది తల్లి.

'ఎక్కడికి పోతారు? ఏమి తింటారు?' యిలా సాగేవి బాధ్యత తెలిసిన సుబ్బలక్ష్మి ఆలోచనలు. అందరి మధ్యా నలిగిపోయేదామె.

కాలక్రమేణా కలతలు మొదలయ్యాయి రామకృష్ణ తరఫు బంధువుల వల్లా, వీళ్ళవల్లా సుబ్బలక్ష్మి, రామకృష్ణల మధ్య. చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు చేసిందామె. ఆ తర్వాత తమ్ముడికి

వివాహం నిశ్చయమైందని వేరే వెళ్ళిపోయారు వాళ్ళు అక్కడికి దగ్గర్లోనే యిల్లు చూసుకుని.

సుబ్బలక్ష్మి తమ్ముడు వెంకట్రావుకు స్వార్థమెక్కువ. వాళ్ళు వెళ్ళిన కొంతకాలానికి దసరా పండుగ వచ్చింది. మంచి ఉద్యోగం చేసుకుంటున్నాడు. అయినా, "నా వద్ద డబ్బుల్లేవు, పండుగకు మీ యిద్దర్నీ పిలవలేకపోతున్నాను" అంటూ చెప్పాడు సుబ్బలక్ష్మితో.

సుబ్బలక్ష్మి ఏడవలేక నవ్వింది. 'తనలా అనుకుంటే వీళ్ళేమయిపోయేవాళ్ళు. భర్తను కూడా కాదని వాళ్ళకు 'మంచిగా తిని, ఉండండి' అని చెప్పేది. భర్తతో ఎన్నోసార్లు తగవు పడింది వీళ్ళవల్ల. డబ్బు చాలదని సరదాలు చంపుకున్నది. అలాంటి తనను, తన భర్తనూ పిల్చి నాలుగు మెతుకులు పెట్టలేని స్థితా! తన తమ్ముడిది' అని మనసులో ఒకటే మధనపడిపోయిందామె.

వెంకట్రావుకు పెళ్ళయింది. గయ్యాళిగంపలాంటి పెళ్ళాం వచ్చింది. ఆవిడ యింట్లో వాళ్ళ మతులు పోగొట్టడమే కాకుండా రామకృష్ణను మంచి చేసుకుని "నీ పెళ్ళాం మంచిది కాదు. దానికి ఆఫీసులో చాలామందితో సంబంధాలున్నాయంటూ' లేనిపోనివి కల్పించి చెప్పేది నిజమని నమ్మేలా. అవి మనసులో బాగా నాటుకుపోయి, రామకృష్ణ అస్తమానం తిట్టిపోసేవాడు సుబ్బలక్ష్మిని. జీతమంతా లాక్కునేవాడు. అప్పులు చేసి, ఝల్సాలు చేయటం మొదలెట్టాడు.

"నీలాంటి లంజతో కాపురం చేయాల్సిన అవసరం నాకు లేదు. విడాకులు తీసుకుందాం. పిల్లలు లేని గొడ్రాలివి. నేనెందుకు భరించాలి?" అని తరచూ తగవులాడేవాడు, అబద్ధాలను అతికినట్లు చెప్పే వెంకట్రావు భార్య గజలక్ష్మి మాటలు విని.

సుబ్బలక్ష్మిని ఆమె ఆఫీసులో దేవతలా ఆరాధిస్తారు ప్రవర్తన, పని విషయంలో. ఎవరైనా వర్క్ తెలీకపోతే యింటికి వచ్చి చెప్పించుకుంటారు. అలా వచ్చిన వాళ్ళతో సంబంధాలు అంటగట్టి రామకృష్ణకు చెప్పేది గజలక్ష్మి. వాళ్ళిద్దరూ విడిపోతే 'అత్త పీడ తనకొదుల్తుంది. ఎటూ మామ చావనే చచ్చాడు' అని ఎత్తువేసి, వాళ్ళిద్దరూ వేర్వేరుగా వుండేట్లు చేసి, తనకు అదనంగా అన్పించిన అత్తను సుబ్బలక్ష్మికి తగిలిచింది. ఆ తర్వాత భర్తతో ఝల్సాగా తిరుగుతుండేది సినిమాలకూ, షికార్లకూ. తనవాళ్ళను యింట్లో తెచ్చిపెట్టుకుంటుండేది తరచూ.

★ ★ ★

నేనొక్కదాన్ని అడ్డం నీకు. లేకపోతే ఎవర్నో ఉంచుకునేదానివే అంటూ అస్తమానం సాధించి పోస్తుండేది సుబ్బలక్ష్మి తల్లి కూతురి త్యాగబుద్ధిని అర్థం చేసుకోకుండా.

'నా కథకు ఓ అంతమంటూ లేదా? నేనిలా సాధింపులతో బ్రతకాల్సిందేనా? అన్ని రకా మానసిక దిగుళ్ళతో జీవితాంతం యాంటీ డిప్రజెంట్స్ మింగుతూ జీవచ్ఛవంలా, కొవ్వొత్తిలా కరిగిపోతూ బ్రతుకుతూ, వుండాల్సిందేనా? నా తలరాతే అలా రాసి వుంటాడు దేముడు...' అనుకుంటూ వుంటుంది సుబ్బలక్ష్మి, తల్లి నాంచారమ్మ తిట్లు రోజూ వింటూ.

(వనితాజ్యోతి, జూలై 97)

# మంచికిపోతే

మంచికిపోతే చెడెదురవటం అన్ని యుగాలలోనూ ఉన్న విషయమేనని అనుభవజ్ఞుల ఉవాచ.

"మిమ్మల్నేమీ అనను. ఒకరికొకరు సహకరించుకుంటూ పని పెండింగ్‌లో పెట్టకుండా, పైవాళ్ళతో మన సెక్షన్‌కు ఏమాటా తెప్పించకుండా చూసుకోండి" అని ప్రమోషన్ మీద సెక్షన్ హెడ్‌గా వచ్చిన రోజు స్టాఫ్‌తో అన్నది రేవతి.

"అలాగే మేడమ్! అంతకంటే మాకేం కావాలి" అన్నారందరూ కోరస్‌గా.

సెక్షనంతా కలయజూసిందామె. ఆ బిల్డింగ్ ఒక నాడు నవాబుల నివాసం. ఇప్పుడది కొన్ని ప్రభుత్వాఫీసులకు నిలయం. కానీ ఒక మూలగా ఉన్న ఆ సెక్షన్‌లో గోడలకు సున్నం వేసి ఎన్నేళ్ళయిందో నన్పించింది. పైన రేకులు.

"ఎండాకాలం వస్తే వడలిపోయిన వంకాయల్లా అవుతాం మేడమ్" అన్నది హిమంత అనే ఒక టైపిస్ట్.

మర్నాడే ఒక రిప్రజెంటేషన్ వ్రాసి, సెక్షన్‌లో అందరితో సంతకాలు చేయించి తత్సంబంధిత సెక్షనాఫీసర్‌కు నేరుగా పంపిందామె అటెండర్ యాదగిరితో. ఆఫీసర్ ద్వారా అయితే త్వరగా కావు పనులు. ప్రభుత్వ ఆఫీసుల్లో స్టేజ్ బై స్టేజ్ దాటుకుంటూ ఆలస్యంగా జరుగుతాయి పనులు కాయితాల మీద.

కానీ రేవతి పద్ధతలా ఉండదు. ఆమె ఎక్కడ పన్చేసినా (క్లర్క్‌గా ఉన్నప్పుడు కూడా) ముందు పనికి రాని చెత్తంతా తన సీట్లోదే కాక, మిగతా బద్ధకస్తుల సీట్లవీ చూసి, రికార్డ్ సెక్షన్‌కు పంపిస్తుంది. అప్పుడు ఉన్నవన్నీ ఇయర్‌వైజ్‌గా పెడ్తుంది. అవతల వాళ్ళతో అలాగే చేయిస్తుంది. అప్పుడు అవసరమైతే ఫైలు వెతికే నెపంతో గంటలు గంటలు టైమ్ వేస్ట్ చేసే పనివుండదు.

పై ఆఫీసర్‌కు ఏరకమైన క్వెరీలు వేసే అవకాశం యివ్వకుండా రూల్ పొజిషన్‌ను చక్కగా వివరిస్తూ ఫైల్ పుటప్ చేస్తుంది. అందువల్ల డిలే జరగదు డిస్పోజల్స్‌లో.

ఒక్కోసారి మానవతా దృక్పథంతో పరిశీలించాలంటూ సదరు క్యాండిడేట్‌కు మంచి జరిగేలా వ్రాసి ఎందరికో సహాయం చేసిందామె. తనకు ప్రభుత్వం జీతమిస్తుంది, దానికి ప్రతిగా కష్టించి పనిచేయాలనే తత్వం ఆమెది. అదనంగా డబ్బాశించి, రోజులు తరబడి తన సీటు చుట్టూ తిప్పుకోదు పని కావాల్సిన వాళ్ళను. అవతలి వాళ్ళు ఎంత యిబ్బంది పడతారో తనా స్థానంలో ఉంటే ఎలా ఫీలవుతుందోనని ఆలోచించి వర్క్ చేస్తుందామె.

ప్రస్తుతం సెక్షన్‌లో సెక్షన్ హెడ్‌గా వచ్చింది కాబట్టి ఎన్నేళ్ళనుండో టేబుల్స్ క్రిందా, బీరువాలమీదా కదిలిస్తే నెత్తిన పడేట్లున్న ఫైల్స్ తుప్పు వదిలించింది.

తర్వాత రంగులు వేయించారు సెక్షన్‌లో బిల్డింగ్స్ శాఖకు సంబంధించిన సెక్షన్ ఆఫీసర్‌గారు. ఎండకు స్టాఫ్ కష్టపడకుండా కాలక్రమంలో ఫాల్స్ సీలింగ్ కూడా

వేయించేలా చేసింది రేవతి సెక్షన్‌లో. చక్కగా కర్టెన్స్ వేయించింది కిటికీలకు.

స్టాఫ్ అందరికీ అప్పుడప్పుడూ చిన్న చిన్న ప్రజంటేషన్స్ యిచ్చి ఎంకరేజ్ చేసేది.

'మన సెక్షన్ అందం చూసి ఏ ఆఫీసర్‌గారో తన రూమ్‌గా కావాలంటారేమో మేడమ్' అన్నాడు సలీమ్ అనే క్లర్క్. నవ్వి ఊరుకుంది రేవతి.

అయితే యింతకుముందు ఆఫీస్‌లో క్లర్క్‌గా చేసిన అధిక చాకిరీవల్ల ఉన్న వెన్ను బలహీనత, భర్త డబ్బు పీడింపు, రోగిష్ఠి తల్లికి ఆస్పత్రిలో ఉన్నప్పుడు, యింట్లో చాకిరీలు చేయటంతో తరచూ కళ్ళు తిరిగి పడిపోవటం, కాళ్ళు కదల్చలేకపోవటంలాంటి పరిస్థితు లెదురయ్యాయామెకు. మరదలు అదే టైమ్‌లో కని ఉండటంవల్ల తల్లికున్న జబ్బువల్ల పసిపిల్లకు ఇన్‌ఫెక్షన్ అని తల్లిని తన దగ్గర పెట్టుకుంటే ఆ మరదలు రేవతి మంచి తనం అర్థం చేసుకోక అత్తను ప్రక్కనే ఉన్న తమ్ముడింట్లో కీడ్చుకుపోతే అక్కడ ఆ రాక్షసి గోలకు తల్లి చచ్చిపోతుందని తమ్ముడికి నచ్చచెప్పి తన వద్దనే ఉంచుకుంది. మరదలు కక్షతో రేవతి భర్త రామకృష్ణతో "వెళ్ళగొట్టు ఆ ముసలిదాన్ని" అని నూరిపోయటంతో రేవతికీ, భర్తకూ గొడవలు ప్రారంభమై టెన్షన్‌తో మరింత రోగిగా తయారయిందామె.

వెన్నుకు సి.టి.స్కాన్, తర్వాత రెండు వారాల రెస్ట్, మందులు వాడినా రోగం తగ్గక నరకంలాంటి మైలోగ్రామ్ కూడా అయి, ఎల్4, ఎల్ 5 డిస్క్ ప్రొలాప్స్ కోసం ఆపరేషన్ చేయించుకోవాల్సి వచ్చింది కాళ్ళు చచ్చుపడిపోయే ప్రమాదముందని డాక్టర్ చెప్పటంతో.

అంత చాకిరీ చేసే రేవతి మూడు నెలలు సెలవులో ఉండి, ఎక్కువగా కూర్చోలేక ఆ సెక్షనెటూ మూలగా ఉంది కదా!ని స్టాఫ్‌తో ఆలోచించి, ఒక పొడుగుబల్ల వేయించుకుని కూర్చోలేనప్పుడు నడుం వాల్చేది దానిపై. నడుముకు బెల్ట్ (చీరపైనే), సెర్వికల్ స్పాండిలోసిస్‌వల్ల తల తిరక్కుండా మెడకు సెర్వికల్ కాలర్‌తో అంతరిక్షంలోకి వెళ్ళే వ్యోమగామి అవతారం దాల్చింది రేవతి.

సెక్షన్‌కంత మంచి చేసినా పైకి మెచ్చుకుంటూ ప్రక్కకు తిరగ్గానే మూతులు విరిచే ఆడ సిబ్బంది "ఆ ఏదో మా మేడమ్‌గారి వల్ల ఎండకు మాడిపోయే గతి తప్పింది" అంటూ నోరు మాట్లాడుతుంటే నొసలు వెక్కిరించినట్లు చేసేవాళ్ళు.

★★★

కాలం మరికొంత ముందు కురికింది. అసలు టి.వి.ల వల్లే బరువుగా గడిచేకాలం త్వరగా గడిచిపోతున్నదా! అననిపిస్తుంది. ఎందుకంటే మంచి కార్యక్రమాలు రేపొస్తాయికదా! అని ఎదురు చూడటంతో రోజులు, నెలలు, సంవత్సరాలు త్వరగా గడిచిపోతున్నాయి. టి.వి.లో అడ్వర్టయిజ్‌మెంట్లు అవీ మెచ్చుకోతగ్గ అంశాలు. అవి కనిపెడ్తున్న వాళ్ళు నిజంగా మేధావులేననిపిస్తుంది రేవతికి.

రేవతి గురించి, ఆమె రచనలు, మరికొన్ని హాబీల గురించి 'ప్రతిభ' అనే శీర్షికలో బాగా వ్రాశారు ఒక దినపత్రికలో.

'నీదేరా ప్రతిభ అంటే' అని ఒకరూ, 'ఎందుకూ మనమూ ఉన్నామని' మరికొందరూ ఎకసెక్కెంగా మాట్లాడ్డం మొదలెట్టారు సెక్షన్‌లో. అప్పట్నించీ స్టాఫ్ అందరూ ఏదో నేరం చేసినదాన్ని చూసినట్లు ట్రీట్ చేయటం మొదలెట్టారు. తనకుగా అందుకే తన టాలెంట్స్ గురించి ఎవరితోనూ చెప్పుకోదు రేవతి. గోరంత కొండంతలు చేసి పబ్లిసిటీ యిచ్చుకునే తరహా కాదామెది.

"క్రిందకెళ్ళి పదినిమిషాల్లో వచ్చేస్తా మేడమ్"

"సెక్రటేరియట్‌లో మా సులోచన కేస్ ఏమయిందో కనుక్కొస్తా మేడమ్"

"నిన్న మన ఆఫీసర్‌గారు సున్నా పెట్టలేదు కదా! సంతకం పెట్టేస్తాను"

"ఊరికే సంతకం పెట్టి మీ కిస్తున్నాను. ఆఫీసర్‌కు పంపకండి, మీ దగ్గరేపెట్టుకోండి మేడమ్" అని ఆఫీసెగ్గొట్టి మర్నాడు సంతకాలు పెట్టటం, గంట పర్మిషన్ అని మూడు నాలుగు గంటలు ఆలస్యంగా రావటం, ఐదుకు బాగా ముందే పోవటం, సంతకాలు పెట్టి స్వంత పనులు చూసుకురావటం, పదిన్నరకు రావాల్సింది ఏ మూడు గంటలకో వచ్చి కనీసం లేటయిందని కూడా చెప్పకపోగా అక్కడ తమకొక బాస్ ఉందని కూడా చూడకుండా తాపీగా కూర్చుని పకపకలూ, పకపకలూ పోవటం చేసేవాళ్ళు ముఖ్యంగా ఆడవాళ్ళిద్దరు. తన మంచిని వాళ్ళు ఆ విధంగా మలుచుకున్నారనుకుంది రేవతి.

"మా మేడమ్‌గారు ఏమీ అనరు. ఎప్పుడడిగినా వెళ్ళమనే అంటారు" అంటూ ముందర కాళ్ళకు బంధాలు వేసేలా వాళ్ళకోసం ఎవరన్నా వచ్చినప్పుడు రేవతిని ఉబ్బించేలా మాట్లాడటం,

ఇన్నాళ్ళూ మేము అన్నీ తెలిసినట్లు ఫోజులు కొడుతుంటిమే, మమ్మల్ని మా.భావాల్ని ఎక్స్‌రే తీసినట్లు కనుక్కుంటున్నదనే ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌వల్లా-

కొన్ని రోజులపాటు అవసరమైన పని పెండింగ్‌లో పెట్టి షార్ట్‌హ్యాండ్ వంకతో చీఫ్ యింజనీర్ వద్ద ఉండే స్టెనోతో బాతాఖానీ కొడ్తూ 'ఆ వర్క్ త్వరగా కంప్లీట్ చేయండి' అని మాత్రమే అన్నందుకు ముప్పయి ఏళ్ళు దాటినా పెళ్ళికాని మాధురి అందరితో చెప్పుకుని ఏడ్చింది, మొగుణ్ణి కొట్టి మొరపెట్టిన సామెతలాగా.

మిగతా వాళ్ళను రేవతి మీదకు రెచ్చగొట్టటంలో ఆ పొట్టిగిత్త మాధురిదే ముందడుగు.

అది ఆఫీసని లేకుండా పెద్దగా పాటలు పాడటం, సుబ్బారావ్ అనే క్లర్క్‌ని మరో టైపిస్ట్ మోసగించి, ఎవర్నో పెళ్ళాడితే సుబ్బారావుకు సారీ చెప్పటానికి ఆవిడొస్తే సుబ్బారావు ఆవిడను చెంప పగలగొట్టాడనీ, ఎప్పుడూ షేర్ల గురించి మాట్లాడుకోవటం, డబ్బు సంపాదించే విధంపై రకరకాల అడ్డదోవలగురించి స్వేచ్ఛగా మాట్లాడుకోవటం, క్రికెటర్లు, స్మగ్లర్లూ, మిగతా ఆటగాళ్ళు తెగ సంపాదిస్తున్నారనీ బాధపడటం, ఎన్నో... ఎన్నెన్నో... రేవతి స్వేచ్ఛ యిచ్చినందుకు వాళ్ళు అలుసు తీసుకుని చేస్తున్న ఆగడాలు.

"ఆ మంచా.. పాడా.. ఈ రోజుల్లోనా... అహ... హ... హ... ఎవరైనా నమ్మే విషయమేనా,

ఏ స్వార్థం లేకుండా ఫలానా వాడు కానీ కట్నం లేకుండా మా అమ్మాయిని పెండ్లి చేసుకోటాన్కి ముందుకొచ్చాడంటే వాడిలో ఏ లొసుగులున్నాయో ఎవడు చూడొచ్చాడు. ఆ డాక్టర్ ఏగానీ తీసుకోకుండా ఎందుకు వైద్యం చేస్తాడు. ఏదో ఉండుంటుంది. మంచికి పోయి అప్పులిస్తే ఎగ్గొట్టడం, మళ్ళీ మళ్ళీ ఇచ్చినవాడినే అడిగి యిబ్బంది పెట్టటం, నెగిటివ్ ఆలోచనలు చేయటం యీనాడు అందరూ చేస్తున్నపని.

బాస్‌లు స్టాఫ్‌ను ఏడిపించడం వింటాం కానీ మంచి బాస్‌ను కూడా టీజ్ చేసే స్టాఫ్‌ను వీళ్ళనే చూస్తున్నాననుకుంది రేవతి.

ప్రజా నాయకులుగానీ, స్వచ్ఛంద సంస్థలు, సంఘ సేవకులు, ఇరుగు పొరుగులు (యిక్కడ అన్ని దేశాలను కూడా లెక్కించవచ్చు), ప్రేయసీ, ప్రియులు, భార్యా భర్తలు, పెద్దలూ-పిల్లలూ, స్నేహితుల విషయంలో బంధువుల మధ్య అన్ని రంగాలలోనూ మంచి చేయబోతే దాంట్లో ఏదో గూడు పుఠాణి ఉందని అనుమానించే జనాలే కోకొల్లలు యీనాడు. ఏసుక్రీస్తు తదితర ప్రవక్తలు జనానికి మంచి చెప్పబోయి తమ జీవితాలను ఎలా ముగించుకున్నారో లోక విదితమే కదా!

మంచి చేయాలనుకుంటే చెడే ఎందుకు జరుగుతుంది? మంచి ఎదురవదెందుకు? మనుషుల్లో స్వార్థమూ, యీర్ష్యా తదితర కారణాలవల్లనా?

ఇద్దరు టైపిస్ట్‌లు బాగా లంచాలొచ్చే సెక్షన్స్‌కు లంచ మిచ్చి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని, ఆ సెక్షన్‌లో గొడవలకు తట్టుకోలేక బైటకొచ్చాం అని దారుణంగా చెప్పుకోవటం రేవతిని బాధించింది బాగా.

తనవాళ్ళు తనను పావులా వాడుకుని మంచి చేసినందుకు గుర్తించకపోగా, "తన డ్యూటీయే అలా చేయటం" అన్నట్లు మాట్లాడతారేం? తనందరికీ వెళ్ళినా వెళ్ళకపోయినా అన్ని ఫంక్షన్లకూ అందరికీ ప్రజంటేషన్స్ పంపుతుండేది రేవతి. "ఎందుకు మేడమ్‌కు డబ్బు లెక్కువై అట్లా చేస్తుందా?" అని ఒకరు ఎగతాళిగా అనటం కూడా విన్నది రేవతి. అందరూ తన వాళ్ళే ననుకోవటం, అలా ప్రజంటేషన్స్ పంపటం కూడా తప్పేనా అని బాధపడిందామె.

చరిత్ర, పురాణాలను పరిశీలిస్తే, జరుగుతున్న చరిత్రను చూస్తుంటే దేశానికి మంచి చేయబోయే వాళ్ళను పరాయిదేశంలో చంపించటం, స్వార్థపరులకూ, గూండాలకూ, రౌడీలకూ జేజేలు పలకటం- యిదీ యీనాటి పరిస్థితి.

మంచిని మంచిగా రిసీవ్ చేసుకునే రోజు వస్తుందా? అసలు, అలాంటి వాళ్ళు ఐదు శాతమైనా ఉంటారా? అందరూ ఉంటే ప్రపంచ మెంత బాగుపడుతుంది? అని 'నిరంతరం' ఆలోచిస్తూ ఉంటుంది సామాజిక స్పృహ అధికంగా గల రేవతి.

*(ఆంధ్రజ్యోతి- తెలుగు కళాసమితి వారు సంయుక్తంగా నిర్వహించిన పోటీలలో (1997) సాధారణ ప్రచురణకు స్వీకరింపబడినది)*

# "అవార్డుల జాతర"

ఈ మధ్య సరస్వతివి రెండు పుస్తకాలు ఆవిష్కరించబడింతర్వాత కొన్ని సాహితీ సంస్థలనుండి ఆహ్వానాలురావటం ఎక్కువైంది. ఇటువంటి వాటికి ప్రేక్షకులు రారు. అందుకే కొందర్ని వెదకి పట్టుకుని ఆహ్వానాలు పంపుతుంటారు. అందులో భాగంగా రసికజనరంజని ఆర్ట్‌వారి సినీ - సాహితీ అవార్డులకు సంబంధించి ఆహ్వానం వచ్చిందామెకు.

అసలా కార్యక్రమం ఎలా ఉంటుందో అనే ఉత్సుకతతో ఆరోగ్యం సరిగాలేకపోయినా ఆదివారం డి.డి.1లో వచ్చే "స్పిరిట్ ఆఫ్ యూనిటీ కన్‌సర్ట్స్ ఫర్ నేషనల్ ఇంటిగ్రేషన్" ప్రోగ్రామ్‌ను త్యాగంచేసి మరీ వెళ్లింది సరస్వతి.

ఏవో సినిమా స్టైల్‌లో జానపదపాటలకు చిన్న పిల్లల రికార్డింగ్ డాన్సులు, మ్యాజిక్‌షోలూ అయ్యాయి. ముఖ్య అతిథిగారు ఒంటిగంటకు వేంచేశారు.

కవిసమ్మేళనాన్కి పేర్లు తీసుకున్నారు ముందుగానే. ఆహ్వానపత్రికలో విడిగా ఒక కాయితంలో - కవిసమ్మేళనంలో పాల్గొనేవారు కన్వీనర్ గార్ని ఫలానా అడ్రసులో కలుసుకోవచ్చని - (అంటే కొద్దో గొప్పో ముడుపులు సమర్పించుకోవటాన్కి అని అర్థం చేసుకోవచ్చు) వ్రాసి ఉన్నది.

కవిసమ్మేళనంలో సరస్వతిది ఇరవై రెండవ పేరు. కొందరు చాంతాడంత కవితల్ని (అర్థ పర్థం లేకుండా) చదువు తుంటారు. ప్రేక్షకుల (శ్రోతల) సహనానికి అగ్నిపరీక్షపెడుతూ, కొన్ని కవితలయితే మరీ గిటకబారి పోయి సదరు కవుల పేరే కొండవీటి చాంతాడులా ఉంటుంది. తన పేరెప్పుడోస్తుందో, అన్నీ గంటలు కూర్చోలేనే అని బాధ పడుతున్నంతలో కార్యక్రమం మొదలవబోతున్నట్లు సదరు సంస్థ కన్వీసనర్‌గారు మైక్‌ముందు కొచ్చి పెద్దలను వేదిక మీదకు ఆహ్వానించసాగారు. జోలెలాంటి సంచొకటి భుజానికి తగిలించుకుని పాండు రోగిలా ఉన్నాడతను పాపం! ఈ మధ్య కొన్ని సినిమాలలో, యిలా సంచిని జోలెలాగా భుజనికి తగిలించుకోవటమనేది ఫ్యాషన్ (ముఖ్యంగా హీరో పాత్రలు) డబ్బు తగినంతగా లేకపోయినా అందర్నీ సంత్కరించాలనే సదుద్దేశంగల మన్మథరావు గారు యిలాంటి సత్కార్యాన్ని తలపెట్టటం అభినందనీయం" వగైరాలంటూ పెద్దలు మాట్లాడారు.

ప్రభుత్వానికి సంబంధించిన చీఫ్ గెస్ట్‌గార్కి ఎన్నో కార్యక్రమాలుంటాయి. వారు వెళ్లే తొందరలో సీట్లోంచి ఏకంగా లేచిపోయారు ఉన్నట్లుండి. మన్మథరావుగారు ఎదురెళ్లి "సార్ .....సార్" అంటూ బ్రతిమాలుకొచ్చివార్ని సీట్లోకూలేశారు. ఒక శాలువా కప్పారు. వద్దు, వద్దంటూ కప్పించుకుని తృప్తిగా కూర్చున్నారాయన. బహుమతి ప్రధానం వారిచే మొదలుపెట్టబడింది.

ముందుగా పగటి వేషగత్తెలా ఉన్న మన్మధరావుగారి కార్యకర్త ఒకామె అవార్డు అందుకున్నది. ఆవిడ ఏరంగంలో సేవ చేసిందో, ఏమిటో సరిగా తెలీదు. కొందర్ని సంతృప్తి పరచి, దాని ద్వారా చాటుగా మరికొంత ధనార్జన చేసి తమ సంస్థ పేరు ప్రతిష్టలకోసం మన్మధరావుగారు పడుతున్న తపన సరస్వతి కర్ధమైంది.

వరుసగా వందమందిదాకా పేర్లు పిలిచారు - మన్మధరావుగారు. చీఫ్ గెస్ట్‌గార్కి చిర్రెత్తిపోతోందిలా ఉంది. అవార్డు విన్నర్సంతా వేదికపై మూగారు బ్లెలం చుట్టూ ఈగల్లా. అందులో అతి చిన్నవాళ్లు చాలా పెద్దవాళ్లుఉన్నారు. వీరంతా ఏరంగానికి సేవ చేశారో ఆ గందరగోళంలో అర్థం కాలేదు.

"ఫోటోలు కావాల్సిన వాళ్లు తీయించుకోవచ్చు. దీనికి విడిగా డబ్బు కట్టాలి" అంటూ మరో ప్రకటన చేశారు మన్మధరావుగారు. ఒక పద్ధతీ పాడూ లేకుండా అందరూ అలా గుమికూడి చీఫ్ గెస్ట్‌తో కల్సి ఎలా ఫోటో దిగుతారబ్బా! అనన్పించింది సరస్వతికి.

ఆగోలలోంచి బయటపడ్డ ఒక ముసలమ్మగారు (అవార్డువిన్నర్) "అవార్డంటే ఏమిటో అనుకున్నా. కాకికీ కోకిలకూ కూడా ఒకటే రకం మెమొంటోనా! ఒక రేకుమీద సంస్థ ఎంబ్లమ్, దానిపై అవార్డు పొందిన వారిపేరు - క్రింద మన్మధరావు గారి పేరూనూ. నాపేరున్నది ఎవరికో పోయింది. అన్నీ తారుమారయ్యాయి, సంతలా సాగిన ఆగోలలో, అమెరికా వెళ్లబోయే మనవడికి గొప్పగా చెప్పుకున్నా, ఈ రేకు ముక్క నెలా చూపించనూ....' అంటూ గోణుక్కుంటూ సరస్వతి ప్రక్కనే కూర్చుంది.

కవి సమ్మేళనం అయ్యే సరికి ఏ సాయంత్రమో అయ్యేలా ఉందని ఆ ఆదివారపు తెలుగు సినిమా (కళాఖండం) మిస్సవుతానేమో, కళ్లు తిరిగి పడిపోతానేమోననుకుంటూ జనాన్ని తోసుకుని బయట పడింది సరస్వతి. కొన్నాళ్ల తర్వాత 'సాహితీశ్రీ' అవార్డు స్వీకరించండంటూ తన పుస్తకాల ఆవిష్కరణ జరిపించిన శంకర్రావు గార్నుండి ఉత్తరం వచ్చింది సరస్వతికి.

ఎవరిగొప్ప వాళ్ల కర్థం కాదు కాబట్టి (ముఖ్యంగా సరస్వతికి) నిరాశావాది కనుక శంకర్రావుగార్ని కల్సుకున్నదామె ఒకరోజు. ఎందుకు నాకీ అవార్డు యిస్తున్నారంటూ అడిగింది. "ఈ మధ్య మీ పుస్తకాలు రిలీజ్ చేశాంకదా! ఈ అవార్డులు ప్రకటించే కమిటీ ఆర్గరికి ప్రకటించింది వారి సాహితీ సేవను, ప్రతిభను పరిగణనలోకి తీసుకుంటూను. మీ బుక్స్ చాలా బాగున్నాయి. అందరి ప్రశంసలూ పొందాయి. మీరు మంచి పోయట్ కూడా కదా!" అంటూ

సందేహం తీర్చారాయన.

ఆ తర్వాత యిలాంటి కార్యక్రమాలు నడిపించడంలో ఉద్దండులైన శ్రీ శంకర్రావు

ఆధ్వర్యంలో చక్కగా పలువురి ప్రశంసలనందుకునేలా జరిగిందా కార్యక్రమం. కేంద్ర మంత్రిగారు అవార్డులు ప్రదానం చేశారు. బండబారిపోయిన మనసు గల సరస్వతిని యీ సంతోషకరమైన విషయం కొద్దిగా కూడా స్పందింపచేయలేదు.

తన గురించి చెప్పుకోవాలంటే సిగ్గు సరస్వతికి స్వంత డబ్బా వాయించుకుంటుం దంటారని భయం. పబ్లిసిటీ లేకపోతే మనలోని ప్రతిభ పదిమందికీ ఎలా తెలుస్తుందన్న యింగిత జ్ఞానం లేదామెకు.

శంకర్రావుగారు పాటల పోటీలు, కవిసమ్మేళనాలూ, వగైరాలు నిర్వహిస్తూ ఎందరో ప్రతిభా వంతులను వెలుగులోకి తెచ్చారు. పది ఆహ్వానాలు వస్తే, ఒకదానికి వెళ్ళేది సరస్వతి, వెన్నుకయిన ఆపరేషన్‌వల్ల గంటలు గంటలు కూర్చోలేక. క్యాన్సర్‌రోగి అయిన తల్లి కోరికమేరకు పుస్తకాల ఆవిష్కరణ ఏర్పాటు చేయించుకుందప్పుడు. ఆరోజు సెలవు పెట్టి పడుకున్నది నాల్గయిదు గంటలన్నా కూర్చోవాల్సొస్తుందని. నోరుతెరిస్తే కప్పలాగా ఉండే హీరోను ఒక పిక్చర్‌లో తనమాటల చాతుర్యంతో ఉన్నత స్థానానికి తీసికెళ్లిన ఒక ప్రముఖ రచయిత (ఆ హీరో వల్లే ఫేడవుట్ కూడా అయ్యాడతను) మరి కొందరు చాలా చక్కగా సమీక్ష చేశారు, ఆ పుస్తకాల ఆవిష్కరణ నాడు, అనుకున్న విషయాన్ని కుండబద్దలు కొట్టినట్టు చెప్పటమే కాక, అన్నింటికీ చక్కగా పరిష్కార మార్గాన్ని సూచించిందంటూ, మరొక పత్రికా సంపాదకుడూ సమీక్షించాడు ఏదో ఇంగ్లీషు రచనల గురించి మాట్లాడుతూ, శిల్పంలో యింకా కృషి చేయాలన్నారు. పరిణతి సాధించాలన్నారు. మరెవరో మాట్లాడటాన్కి లేచారు. అదే సందని "యిందాకేదో శిల్పం అన్నారు, ఏమిటది?" అన్నది సరస్వతి తెలియనట్లు. "శిల్పం అంటే ముగింపులో ట్విస్ట్ ఉండటం" అన్నాడు నీళ్లు నములుతూ ఆ 'శిల్పం' అన్నతను. "అన్నింటిలో ట్విస్ట్ ఉంటే మూసపోసి నట్లుండదా? కథను బట్టి కథనం, ముగింపు ఉండాలిగానీ" అంటూ ఫెడేల్మని మొహానకొట్టి నట్లడిగింది సరస్వతి.

ఆ తర్వాత సరస్వతి మాట్లాడాల్సి వచ్చింది.

మామూలుగా అందర్నీ, ఉద్దేశించి తర్వాత "రచయితముందుగా విమర్శకుడై ఉండాలి. ప్రతి రచయితకూ తన లోటుపాట్లు తెల్సుండాలి. అలా తెల్సుకున్నప్పుడు ఎవరేమి విమర్శ చేసినా పట్టించుకోనవసరంలేదు... పైగా విమర్శకుడికి రచయిత వ్రాసిన విషయాలపై అవగాహన ముఖ్యంగా ఉంటేనే సద్విమర్శ చేయగలడు" అంటూ కొద్దిగా మాట్లాడిందామె.

మర్నాడు కొన్ని పత్రికలలో బాగా వ్రాశారు. ఈ కువిమర్శల సదరు సంపాదకుడు తన డైలీలో రచయిత్రి ఎంతో ఎదగాలనీ, వగైరా రచయిత్రికి సూచించారనీ వక్రీకరించి వ్రాయించాడు, ప్రశంసించాడని వ్రాయించకుండా. మీరు వేదికమీద చెప్పే నీతులకు

వ్యతిరేకంగా కథలు ప్రచురింమని వెళ్లిన రచయితలకు "పాతచింతకాయపచ్చడి ఎవరికీ కావాలయ్యా! సెక్స్, వయోలెన్స్, ఫిక్షన్ కావాలిగానీ," అని అంటార్ట. ఇదే మన్నా భావ్యమా! నా మీద అలా వక్రీకరించి వ్రాశారేం? పరిణతికి అంతమంటూ ఉందా? అసలు" అంటూ ఘాటుగా వ్రాశారామె అతని కోకలేఖ.

ఆ తర్వాత తనపుస్తకాలను అన్ని లైబ్రరీలకూ పంపింది. కొన్ని సమీక్షలకోసం పత్రికలకూ పంపింది. తెలుగు వాడిని తెలుగువాడు గుర్తించడు ఒక పట్టాన. కానీ మద్రాసులో ఉన్న ఒక తెలుగు మహిళా మాసపత్రికలో మాత్రం వెంటనే ఆమె పుస్తకాలపై చక్కని సమీక్షలొచ్చాయి, ప్రతి పాఠకుడూ చదివి తీరాల్సిన రచనలంటూ. ఆ తర్వాత అది చూసి కొందరి నుండి మీ పుస్తకాలు పంపండంటూ అభ్యర్ధనలొచ్చాయి. అభిమానులేర్పడ్డారు. "మీవి రచనల్లా లేవు. వాస్తవ గాధల్లా ఉన్నాయి. కొడవటిగంటి, రావిశాస్త్రి, తదితరుల రచనలకు ఏమాత్రం తీసిపోవు. మీరు పేరుకోసం, డబ్బుకోసం కలం పట్టినట్లు కన్పట్టంలేదు. ప్రజలకోసం, ఒక సదాశయం కోసం రచనలు చేస్తున్నట్లు కన్పిస్తున్నది. మీరు ఆవకాయ జాడీ నుండి అమెరికా వరకు ఏ విషయాన్నయినా వ్రాయగలరు. మీరు ముందు మాటలో వ్రాసినట్లు 'గొప్పవారితో పరిచయం లేకపోవటం వల్ల ముందుమాట నేనే వ్రాసుకున్నానన్నారు" సత్తా లేని రచనలకు మేధావులు వ్రాసిన సందర్భాలెన్నో ఉన్నాయి. మీకు నిజంగా సాహిత్య అకాడమీ అవార్డు రావాలి, యింకా మీరు రాస్తూ ఉండాలి. మాలాంటి అభిమానుల కోసమంటూ" లేఖలొచ్చాయి.

సరస్వతికి ఆర్థికస్తోమత అంతగా లేక కేవలం రెండు వందలపుస్తకాలు మాత్రమే వేయించుకున్నది, నెలనెలా వచ్చే జీతంలో కొంత ప్రెస్‌లో కడుతూ. ఎప్పుడో మనసు స్పందించి, సమస్య కొత్తగా కన్పించినప్పుడు మాత్రమే వ్రాసిన రచనలామెవి. ఇప్పుడు అనారోగ్యం వల్ల ఎక్కువగా రాసే ఓపికాలేదు. డబ్బుకోసం కమర్షియల్ రచనల జోలికి వెళ్లే తత్వం కాదామెది.

ఆ సంవత్సరానికి సాహిత్య అకాడమీ అవార్డులు ప్రకటించారు. సరస్వతికి రాలేదు. అవార్డులకు సంఖ్యా బలం ముఖ్యమా! ఇందులో కూడా అకాడమీలో సభ్యులుగా ఉన్నవార్ని కనుక్కోని వార్ని సంతృప్తి పరచి యిలా అవార్డులు సంపాదిస్తారా? అనన్పించింది ఆమెకు. తను డైరెక్ట్‌గా పంపింది. కానీ పాఠకుల నుండి వాళ్లకు లేఖలు రావాలట రచనలపై. ఎవరు వ్రాస్తారు? అంత నిజాయితీగా. రాయించుకుంటే తప్పుకుదరదు. అప్పుడు అవార్డులకు విలువ ఉంటుందా? ఈనాడు ఎక్కడ చూసినా అవార్డుల జాతరే.

ఉద్యోగరత్న, సాహిత్య రత్న, విద్యారత్న, ఆ రత్న, ఈ రత్న అంటూ, పుట్టగోడుగుల్లా వెలుస్తున్న సాహితీ సాంస్కృతిక సంస్థలు ధనార్జనకోసం సంస్థల ప్రతిష్ఠను యినుమడిం

పచేసుకోవడం కోసం,అమాయకుల, అత్యాశాపరుల (కళాకారులు) బలహీనతను క్యాష్ చేసుకుని అవార్డులనిస్తున్నాయి.

నిజంగా ప్రతిభ కలవారికి అవకాశాలు లేని వారికి యీ అవార్డులు ఎండమావుల లాంటివే, ఏ నూటికో కోటికో తప్ప. అసలులో సరుకు లేకపోయినా సభల్లో వక్తలకు నిర్వాహకులకు ఘనంగా శాలువాలు కప్పి, దూరదర్శన్‌లో కనిపించేలా చేసుకుని, అన్ని పేపర్లలో వచ్చేలా చేసుకునే వార్కిఇప్పుడు రోజులన్నించింది సరస్వతికి. ప్రతిష్ఠాత్మకమైన అవార్డులమ అవార్డుల కమిటీ వార్ని కాకాపట్టి, ముడుపులు సమర్పించుకుని, పైరవీలుచేయిస్తే తప్ప ఏరకమైన అవార్డులూరావు, ఎన్నడోగానీ.

అందుకే సాహిత్య అకాడమీ అవార్డు నివ్వకుండా ముందుగానే తనకు 'సాహిత్య శ్రీ' అవార్డు పడేశారా? అనే సందేహం సరస్వతికి కల్గింది. ఎందుకంటే తనపుస్తకాలపై విమర్శ చేసిన సంపాదకుడు సాహిత్య అకాడమీ సభ్యుడని తెల్సింది, కాలక్రమంలో అవార్డులలోని కిటుకులు తెలుసుకుంటున్న తరుణంలో. కొన్ని వేల రూపాయలతో అవార్డులు కొనుక్కునే హీనస్థాయి యీనాడు ఉన్నదీ అంటే అవార్డుల స్థాయి ఏ పరిస్థితికి దిగజారిందో అర్థంచేసుకోవచ్చు.

ఆ తర్వాత శంకర్రావుగారు సరస్వతి అన్న ద్వారా ఆమె గురించి పూర్తిగా తెల్సుకుని మనకు జీవితమూ, టాలెంట్స్ భగవంతుడిచ్చిన వరం, అవి ప్రాజెక్ట్ చేసుకోవటంలో తప్పేమిలేదని బాగా బోధించి ఆమె కార్టూన్లు, ముగ్గులు, ఆమె తీసిన ఫోటోలు, వేసిన చిత్రాలూ ఒక ప్రదర్శనగా ఏర్పాటు చేసి, అందులో ఆమె పాడిన శాస్త్రీయ, లలిత గీతాల సంగీతపు క్యాసెట్లు కూడా విన్పించేలా ఏర్పాటు చేశారు.

ముఖ్యంగా యీ ఫోటోగ్రఫీ, కార్టూన్ల రంగంలో ఆడవారికి త్వరగా గుర్తింపురాదు. రానివ్వరు. స్త్రీకి స్త్రీయే శత్రువన్నట్లు సాటి స్త్రీలే అవతలివారి ప్రతిభను గుర్తించరు. ఎవరో శంకర్రావుగారి లాంటి (పురుషులలో) నిస్వార్థపరులు తప్ప. తనలో ఉన్న టాలెంట్స్‌ను ఆవిష్కరింపచేసే ప్రయత్నం జరిగింది. ఆ తృప్తిచాలు. మరే అవార్డులూ తనకక్కర్లేదు - అని తృప్తిపడింది అవార్డుల ఎంపికలో గల తత్త్వం బోధపడిన సరస్వతి.

*(ఆంధ్రజ్యోతి వీక్లీలో)*

# "పెండింగ్ ఫైళ్ళ క్లియరెన్స్ వీక్"

"ఛీఫ్ మినిస్టర్‌గారొస్తారని కబురొచ్చింది. అందరూ సీట్లలో ఉండండి" అంటూ మాపై ఆఫీసరుగారు సీటుసీటుకూ తిరిగి చెప్పెళ్లారు.

సి.ఎమ్.గారు వస్తునే మాడిపార్ట్‌మెంట్‌కు పెద్ద తలకాయ అయిన ఆఫీసర్‌గారి వద్ద కెళ్లారు మందీ - మార్బలంతో. ఫొటోగ్రాఫర్లు, పత్రికా రిపోర్టర్లు అందరూ వారి వెంటనే ఉన్నారట.

"జీతాల బిల్లులూ, లీవ్‌శాంక్షన్స్, వగైరాలకు సంబంధించిన సెక్షన్స్ ఎక్కడ?" అంటూ ప్రశ్నించారట పెద్దతలకాయను.

వారు వెనుకా, ముందూ ఆలోచించకుండా "నాకు తెలీదు" అని ఠపీమని సమాధానం చెప్పార్ట కనీసం తన క్రింది ఆఫీసర్ల వేపుచూస్తే వాళ్లు ఎటున్నాయో దారితీసేవాళ్లనే ఆలోచనలేకుండా' అందర్నీ బయటకెళ్లమని. తలుపులేసి. పెద్దతలకాయగార్ని ఛడామడా తిట్టేశార్ట సి.ఎమ్.

"నువ్వెప్పుడూ చెకింగ్‌కెళ్లవా సెక్షన్స్‌కు? ఏదెక్కడుందో తెలీకుండా పన్చేస్తున్నావన్నమాట యిన్నెళ్లూ" అంటూ కేకలేశార్ట లోపల. వారే బయటకు వచ్చింతర్వాత కొందరితో అన్నట్టు భోగట్టా.

"మెమో" కూడా ఇష్యూ చేయిస్తానని అన్నారని వినికిడి.

ఒక్కోక్క ఫైలూ తీస్తుంటే అంగుళంమందాన దుమ్ముట. "అనవసరమైనవన్నీ ఎందుకిట్లా పెట్టుకుంటారు? మీకుడస్ట్ వల్ల ఎలర్జీవస్తుంది కదా! అలా అస్తవ్యస్తంగా ఉన్న ఫైళ్లతో పనిమాత్రం సక్రమంగా ఎలా చేస్తారు?"అంటూ దుమ్ముదులిపొదిలిపెట్టార్ట. దాదాపు ఎన్నో ఏండ్ల నుండీ పెండింగ్‌లో ఉండి, పరిష్కారంకాకుండా పడి ఉన్నాయట చాలా ఆఫీసుల్లో ఎన్నోఫైళ్లు.

సీట్లలో జనమే సరిగా లేరుట కొన్నిచోట్ల. పర్సనల్ రిజిష్టర్స్ మెయింటెయిన్ చేసే వాళ్లు బహు తక్కువట. ఎవరూ ఏమీ చేయలేని, కూకటివేళ్లతో పాతుకుపోయిన లంచగొండితనం బయట పడుతుంది కదా! కొంత వరకు పర్సనల్ రిజిష్టర్స్ మెయింటెయిన్ చేస్తే. ఎందుకంటే ఆపేపర్ ('కరెంట్' అంటారు ప్రభుత్వ పరిభాషలో) ఎప్పుడు, ఎక్కడ్నించి వచ్చిందీ, ఎప్పుడు డిస్పోజల్‌కు పెట్టిందీ, ఆఫీసర్ నుండి అప్రూవ్ అయి ఎప్పుడొచ్చిందీ, వెళ్లాల్సినచోటకు ఎప్పుడు డిశ్పాచ్ అయిందీ తెలుస్తుందని వాటిపై సరిగా శ్రద్ధ చూపరు అవినీతి పరులైన ఉద్యోగులు.

మర్నాడు అన్ని పేపర్లలో మాడిపార్ట్‌మెంట్ గురించే ఫొటోలతో సహా వార్త లెక్కువగా వచ్చాయి.

మన రాష్ట్రంలో అవినీతి తాండవిస్తున్న శాఖల్లో మాశాఖనే ఎక్కువగా చెప్పుకుంటారు. ప్రాజెక్టులు కూలిపోవటం, ఆపీసరుకు కంట్రాక్టర్లతో లాలూచీలు, ప్రజోపయోగకరమైన (సామాజికపరమైన) ఎన్నో పనులకు ఆలవాలమైన మా శాఖలోనే ఆయా పనులకు గండి కొట్టే అవినీతి పనులు విస్తృతంగా జరుగుతుంటాయని, మాడిపార్ట్మెంట్ పేరు చెప్పుకోవాలంటే మాకే సిగ్గు. గంజాయివనంలో తులసి మొక్కల్లాగా నీతిపరులైన ఆఫీసర్లూ, సిబ్బందీ ఉన్నా చెడుకు ప్రచారం అధికంగా ఉన్న మా శాఖలో నీతిమంతులున్నారంటే జనం నమ్మరుకదా!

చీఫ్ మినిష్టర్‌గారు వచ్చేదాకా ఫైళ్లను కుప్పలు తెప్పలుగా పెట్టుకోవటమెందుకు? ఆయన ప్రారంభించిన శ్రమదానం, జన్మభూమి కార్యక్రమాలప్పుడే చెత్తను ఏరిపారేయటం చేయకూడదూ అందరూనూ. అలాకాక పోయినా శుభ్రతను పాటించటం వ్యక్తిగత బాధ్యత కాదా!

మనం ఒకరు ముల్లు గర్రతో పొడిస్తేనే (ఎద్దులనులాగా) పనిచేసే (బద్ధకస్తులం) వాళ్లం అన్నమాట.

ఏ ప్రజానాయకుడైనా సద్భావంతో ఏ కార్యక్రమం తలపెట్టినా ప్రతిపక్షంతో సహా ఏదోరాజకీయం అనివిమర్శించకుండా ప్రతి ఒక్కరూ మనమూ దేశానికి సేవ చేద్దామని అనుకోకపోయినా (అంతగొప్ప త్యాగబుద్ధి మనకు ఏభైఎళ్ల క్రిందట స్వాతంత్ర్యం వచ్చినప్పుడే పోయింది కాబట్టి) మన పరిసరాలను, మన కార్యాలయాలను బాగు చేసుకుంటే (కిళ్లీల ఉమ్ములూ, కాయితీల చుట్టలూ లేకుండా) ఎక్కడ చూసినా శుభ్రత కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది కదా! ఎక్కడ పరిశుభ్రత ఉంటుందో, అక్కడే దైవత్వముంటుందని సూక్తి కదా? మనల్ని ముల్లు గర్రలా పొడిచే యీ 'ఫైళ్ల పెండింగ్' వారోత్సవాలు ఉంటేనే మనం కాస్త ఒంటికి, బుర్రకూ పనిచెబుతాం. లేకపోతే లేదు. ప్రభుత్వం అవినీతి పరులను యిలాంటప్పుడు సస్పెన్షన్లూ. ఛార్జ్‌షీట్లు చేస్తే తప్ప పూర్తిగా బుద్ధిరాదు జనాలకు అనుకున్నాను నేను.

"ఏంటోయ్ శ్రీధర్! అంతలా ఆలోచన్లలో మునిగిపోయావ్! నీకేం వర్తించదా? ఫైళ్ల పెండింగ్ క్లియరెన్స్ తతంగం! అయినా నీవు ఎప్పుడూ పని పెండింగ్‌లో ఉంచవు. సెక్షన్‌ను నీట్‌గా ఉంచుతావు. పర్సనల్ రిజిష్టర్ మెయింటెయిన్ చేస్తావు. స్టాఫ్‌తో సక్రమంగా పన్చేయిస్తావు. అనవసరపు ఫైళ్లను రికార్డ్ సెక్షన్‌కు పంపుతావు. ఇహ నీకేం దిగులు? మాలాంటి వాళ్లకు తప్ప. "అనిదిగులుగా అంటూ మూతికి కిడ్నీలకు ఆపరేషన్ చేయించుకున్న రోగికట్టుకునే బట్టకట్టుకుని, తలకు చేతిరుమాలు చుట్టుకుని, ఒళ్లంతా దుమ్ముతో జోకర్‌లా నా వద్దకొచ్చిన మరో సెక్షనాఫీసర్ సూర్యారావు మాటలకు చిన్నగా నవ్వి ఊరుకున్నాను డ్యూటీని దైవంగా భావించేనేను.

*(స్వాతి వీక్లీలో)*

5

# సమీక్షలు

## యువవాణి కార్యక్రమాలపై

"యువవాణి ప్రసారంచేసే కార్యక్రమాలు యువతరానికి విజ్ఞానాన్ని, వినోదాన్ని సమపాళ్ళలో అందించటంలో చాలా వరకు సఫలీకృతమౌతున్నాయనే చెప్పాలి. కానీ కొన్ని నాటికలలోగానీ, రూపకాలలోగానీ నటీనటుల ఉచ్చారణలో క్రమమార్గం లోపించటం శోచనీయం. ఈ లోపాలన్నీ నిర్వాహకులు గమనించినట్లయితే నటీనటులలో భాషాజ్ఞానాన్ని పెంపొందించి, కార్యక్రమాలు లోపరహితంగా ఉండటానికి తోడ్పడినవారవుతారు. అనౌన్సర్స్ త్వరితకాలంలో మారుతుండటంవల్ల కార్యక్రమాల స్థాయి లోపభూయిష్టంగా తయారవుతున్నది. అలా కాకుండా పర్మినెంట్‌గా సమర్ధనీయులైన వ్యక్తులను కొందరిని నియమిస్తే కార్యక్రమాల స్థితిగతులు సక్రమమార్గంలో ప్రసారమవటానికి అవకాశమున్నది. పునఃప్రసారాల ఆవశ్యకతను తగ్గించి, వర్ధమాన నటీనటులకు, గేయరచయితలకు అవకాశమివ్వాలి. రికార్డులతో కూర్చిన రూపకాలు ఒకేపంథాలో ఉండకుండా, లలిత సంగీతానికి సంబంధించిన గీతాలతో కూర్చి ప్రసారం చేస్తే నూతనత్వాన్ని ప్రవేశపెట్టినట్లవుతుంది. ఈ విషయాలను పరిశీలించి, ప్రసారం చేయటానికి పూనుకుంటే యువవాణి కార్యక్రమాలు లోపరహితంగా ఉండి యువతరానికేకాక, అన్ని వర్గాల శ్రోతల మన్ననలకు పాత్రమౌతాయి.

*(రికార్డింగ్ తేది: 25-12-72)*

## కుటుంబ నియంత్రణ కార్యక్రమాలపట్ల శ్రోతల అభిప్రాయం

ఆకాశవాణి ప్రసారం చేసే కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు ప్రతి ఒక్క శ్రోతనూ ఆకట్టుకుంటున్నాయనటం నిర్వివాదాంశం. కుటుంబనియంత్రణ విధానాలను కొన్ని సభలలో, సమావేశాలలో ప్రచారం చేయటం అక్కడక్కడ మనం వింటూనే ఉన్నాం. అటువంటప్పుడు కొందరు ఆ సలహాలను విని అక్కడే వదలివేయటం కూడా సంభవిస్తున్నది. అలా కాకుండా, ఒక సామాన్య కుటుంబంలో అధిక సంతానంతో ఆర్థికంగా బాధపడుతూ, అనారోగ్యాలకు గురైపోయి జీవితాలు నిస్సారమై పోయిన వ్యక్తుల జీవితాలకు యీ కుటుంబ నియంత్రణ సలహాలను పాటించి, కుటుంబాన్ని సుఖసంతోషంగా మలచుకున్న వ్యక్తుల జీవితాలకు ప్రతిబింబంగా విజ్ఞులకు, సామాన్యులకు అవగాహనమయ్యే రీతిలో యీ కుటుంబనియంత్రణ సూత్రాలకు సంబంధించి రూపొందించిన నాటికలు,

రూపకాలద్వారా యీ విధానాలను ఆచరించి, ఆచరించబోవుతున్న వ్యక్తులతో కూర్చిన పరిచయ కార్యక్రమాలద్వారా కుటుంబనియంత్రణ శాఖవారు ప్రసారం చేయటం ముదావహమైన విషయం. ఈ ప్రసారాలు విన్న అధిక కుటుంబం కల శ్రోతలలోను, నూతనంగా సంసారాన్ని ప్రారంభించబోవుతున్న శ్రోతలలోనూ క్రమేణా పరిణామంకల్గి తమ జీవిత బాటను సుఖమయంగా చేసుకోవటాన్కి ఎంతో దోహదం చేస్తున్నాయి యీ కుటుంబనియంత్రణ కార్యక్రమాలు.

ప్రస్తుతం మన దేశ ఆర్థిక పరిస్థితి, ప్రజల ఆరోగ్యం దృష్ట్యా కుటుంబ నియంత్రణ అనే ప్రయోజనాత్మకమైన సూత్రాన్ని శ్రోతలకు వినిపిస్తూ, కొంతవరకు అత్యధిక జనాభా తగ్గుదలకు, దేశ సౌభాగ్యానికి యీ కార్యక్రమాలు ఎంతగానో తోడ్పడుతున్నాయనటంలో సందేహంలేదు.

*(రికార్డింగ్ 10.12.72)*

*బ్రాడ్‌కాస్టింగ్ : డిసెంబర్ 29, 1972, 7.45 పి.ఎం.*



# సాహిత్య విమర్శ

సెప్టెంబర్ నెల 'వెరయిటి' సంచికలో థామస్ హార్డీ నవల 'టెస్ ఆఫ్ ది డి అర్బర్ విల్లెస్' సంక్షిప్త నవలానువాదం 'పతివ్రత' చదివింతర్వాత బహుమతి కోసమని కాక హృదయపు లోతుల్లోంచి వచ్చే బాధా వీచికల తాకిడికి తట్టుకోలేక యీ సమీక్ష వ్రాయాలనిపించింది.

మొదటినుండి 'టెస్' పాత్రయొక్క వ్యక్తిత్వం నన్నాకట్టుకున్నది. కుటుంబశ్రేయస్సుకొరకు ఆమె పడే తపన (గుర్రం చనిపోయిన సందర్భంలో వగైరా) తనకు అన్ని విధాలా అయిష్టత కలిగించే ఎలెక్ డి అర్బర్ విల్లె 'కుటుంబం'తో ఆర్థిక సహాయం కోసం చిన్న వయసులోనే అభిమానాన్ని చంపుకుని బ్రతకవలసి రావటం, అతని ద్వారానే అన్యాయానికి గురికాబడి అన్యాయమైపోయాను కాబట్టి సాధారణ స్త్రీలా అతనితో వేరే జీవితం గడపాలనుకోకుండా అతనివల్ల జరగరాని అవమానాన్ని పొందినా స్వతంత్రంగా మనసుకు నచ్చిన విధంగా జీవించాలనుకునే 'టెస్' పట్ల పాట్లు వర్ణనాతీతం.

ఏంజల్‌ను ప్రేమిస్తున్నా తన శరీరం మలినమయిందని, స్వచ్ఛంగా, పూర్తిగా అతనికి తనను అర్పించుకోలేక పోతిననీ, అందుకే తనకు మొదట అతను 'నాట్యం' సమయంలో చూసినప్పుడే పరిచయమై ఉంటే ఎంతో బాగుండేదని 'టెస్' పడిన తపన ఏ దేశపు స్త్రీ

కయినా మానసిక, శారీరక పవిత్రత ఎంత ముఖ్యమో. అపురూపమో విశదపరుస్తుంది.

మగవాడు తప్పుచేస్తే భూదేవిలా స్త్రీ క్షమిస్తుంది కానీ, అదే తప్పు స్త్రీకి అనుకోనివిధంగా, అయిష్టంగా పరిస్థితుల ప్రాబల్యంవల్ల జరిగినా మగవాడు 'ఆ తప్పుని భరించలేడు. సహృదయంతో ఆ స్త్రీని స్వీకరించలేడనటానికి నిదర్శనం ఏంజల్, టెస్ పాత్రలు.

ఇది నిజంగా ఉపోద్ఘాతంలో చెప్పినట్లుగా హిందూ జీవనానికి దగ్గర పోలికలున్న నవల. 'టెస్' మనో పవిత్రతను అర్థం చేసుకోకుండా, అభిమానవతి అయిన 'టెస్'ను అనేక కష్టనష్టాలకు గురిచేసి, చివరకు అనుక్షణం అసహ్యించుకునే 'డి అర్బర్ విల్లె'కి సన్నిహితంగా వచ్చే స్థితిని కల్గించిన 'ఏంజల్' పాత్ర మన భారత సగటు పురుషుడి వ్యక్తిత్వానికి ప్రతీక.

గులాబీముల్లు గ్రుచ్చుకోవటం, కోడిపుంజు మరీ మరీ అరవటాన్ని అపశకునాలుగా భావించడం చదువుతుంటే అపశకున చిహ్నాలుగా మన హిందువుల నమ్మకాలు గోచరిస్తాయి. మన జీవితానికెంతో దగ్గరగా ఉన్నాయి ఆ పరిసరాల వర్ణనలు, వ్యక్తుల మనస్తత్వాలు అని అన్పిస్తాయి.

పూర్వపు వంశ గొప్పతనాన్ని ప్రస్తుత నిర్భాగ్య పరిస్థితులలో కూడా చాటుకుంటూ సంతానానికి పరిమితి విధించక, పిల్లల మనస్తత్వాన్ని అర్థం చేసుకోకుండా కుటుంబ స్వార్థానికి వాడుకునే అనేకమంది తల్లిదండ్రులకు ప్రతిబింబాలు 'టెస్' తల్లిదండ్రులైన మిసెస్ అండ్ మిస్టర్ జాక్ డర్బీఫీల్డ్.

సర్వస్వంగా ప్రేమించినా, త్యాగం చేసినా స్త్రీ తర్వాతనే పురుషుడు. తనను నమ్మి మనసావాచా అతనే సర్వస్వమనుకున్న 'టెస్', ఏంజల్ చివరిసారిగా తన కోసం వచ్చినప్పుడు అతన్ని పరుషంగా మాటంటేనే భరించలేక, 'ఏంజల్'కు తనని దూరం చేయాలని వలపన్నిన 'డి అర్బర్ విల్లె'ను హతమార్చి, చివరంటా తన కుటుంబ క్షేమంకోసమే ఆలోచిస్తూ చెల్లెలి మంచితనాన్నీ, చెల్లెల్ని పరిణయమాడమనీ ఏంజల్‌కు చెప్పగలిగిన 'టెస్' వ్యక్తిత్వమెంత మహోన్నతంగా ఉన్నది! ఎంత పవిత్రమైనది!

నిజంగా అప్పుడు 'టెస్' అనే వ్యక్తి ఉండివుంటే ఆవిడకే అటువంటి అన్యాయాలు, అనుభవాలు జరిగి ఉంటే పూర్వాపరాలు ఆలోచించ నక్కరలేకుండా 'ఉరి'తీయటం చట్టరీత్యా ఎంత అన్యాయం? అమానుషం? చట్టం పురుషుల చేతుల్లో ఉంది కనుకనా! అప్పుడూ ఇప్పుడూ కూడా!

*(కన్సొలేషన్ బహుమతి పొందినది)*

*(వెరైటి, 12/81)*



# పాఠకుల పేజీ

కరువు కాటకాలు వచ్చినప్పుడు ఏ దేశ బీద ప్రజలైనా పడే అగచాట్లు ఒకటే. హృదయవిదారకమైనవి, గగుర్పొడిచేవి. వాంగ్‌లుంగ్ కుటుంబంతో దక్షిణ ప్రాంతానికి వెళ్ళి పడిన బాధలే దీనికి తార్కాణం. అక్కడ 'బానిసలు'గా తమ ఆడ పిల్లలను ఏ పరిస్థితుల్లో అమ్ముకుంటారో కూడా విశదీకరించబడింది. భార్యలో పటుత్వం ఉడిగిపోగానే మగవాళ్ళు మరో స్త్రీపై మోజు చూపించే వాంగ్‌లుంగ్ వ్యక్తిత్వం లాంటివి ప్రపంచమంతటా ఉన్నాయి. ఇది పురుష ఆధిక్యతకు, అహంకారానికి నిదర్శనం మాత్రమే.

'ఓలాన్' సగటు స్త్రీ జాతికే ఆణిముత్యం లాంటిది. పురుడొస్తే నాలుగు నెలలు మంచం దిగకుండా, జరుగుతుంది కాబట్టి అని సుకుమారా లొలకపోసే స్త్రీలకు 'ఓలాన్' ప్రసవించగానే పరిసరాలన్నింటినీ తానే శుభ్రం చేసుకుని, పొలం వెళ్ళిన సందర్భాలూ చదివి నేర్చుకోవలసింది ఎంతో ఉన్నది.

'బానిస'గా అష్టకష్టాలుపడి, భర్తకు కష్టసుఖాల్లో తోడునీడగా నిలిచిన 'ఓలాన్' లాంటి ఆడవాళ్ళు విద్యావంతుల్లో కూడా ఉండరు.

అన్నీ అమర్చినట్లు జరుగుతుంటే మనసు అన్నింటిమీదికీ పోతుంది. 'ఓలాన్' మంచాన పడేసరికి, ఇల్లంతా పిల్లలూ, అన్నీ అస్తవ్యస్తంగా తయారై, 'ఓలాన్' అంటే ఏమిటో 'వాంగ్‌లుంగ్'కు అవగత మవుతుంది.

చివరలో ఆవిడ కనీసపు కోరిక 'ఆ రెండు ముత్యాలు' దగ్గపెట్టుకోవటాన్ని కూడా తీర్చలేకపోతినే అని 'వాంగ్‌లుంగ్' పడిన ఆవేదన మన కుటుంబాల్లో వ్యక్తులు మరణించిన తర్వాత వారి కనీస కోరికలను కూడా బ్రతికి వున్నప్పుడు తీర్చలేకపోతిమే అని వారి సన్నిహితులు పొంగి పొంగి ఏడ్చే సంఘటనలు గుర్తుకు వస్తాయి.

'ఓలాన్' బానిస అయినా ఆవిడ క్లిష్ట సమయాల్లో కుటుంబ శ్రేయస్సుకు తీసుకునే నిర్ణయాలు, కుటుంబ క్షేమంకోసం శ్రమపడ్డ సంఘటనలు ఉన్నతంగా చిత్రించారు రచయిత్రి. మిడిమిడి జ్ఞానంతో అహంతో భర్తలను ఎదిరించి, కుటుంబ కల్లోలాలకు కారణమయ్యే ప్రతి స్త్రీ చదివితీరాల్సిన నవల యిది.

పిల్లలు, బంధువులు, వీరిమధ్యగల బాంధవ్యాన్నీ, ప్రేమనూ సహజంగా వర్ణించారు రచయిత్రి.

చివరివరకూ తను నమ్ముకున్న భూమికోసం 'వాంగ్‌లుంగ్' పడిన శ్రమ, ఆవేదన, ఆ భూమిని నిలుపుకోవటానికి అతను పడిన పాట్లు సామాన్య రైతునుండి భూస్వామివరకు ఎదగటం- రైతు జీవన విధానానికి ఔన్నత్యాన్ని తెచ్చిపెట్టాయి.

"ధనికులు తమ వద్ద ఉన్నది మనకు పంచిపెడితే వర్షం వచ్చినా రాకపోయినా మన అందరికీ డబ్బూ, తిండీ ఉంటుంది' అని విప్లవాత్మకంగా చెప్పిన రచయిత్రి మాటలు మనలాంటి వర్ధమాన దేశాలకు శిరోధార్యాలు.

(వెరైటి 1/82)

# ప్రతిఘటన

శరీరానికి శిరస్సు ఎంత ముఖ్యమో ఒక చలనచిత్రానికి దర్శకుడు అంతటి ముఖ్యుడు.

'ప్రతిఘటన' చిత్రంలో దర్శకుడికి అన్ని విధాలా స్వేచ్ఛ యివ్వడం జరిగింది. కాబట్టే ప్రతి సన్నివేశమూ ఆయన ఆశించిన విధంగా, అన్ని తరగతుల ప్రేక్షకులకూ నచ్చే విధంగా, అందరూ మెచ్చే చందాన చిత్రీకరించబడటం సంభవించింది.

వజ్రానికి ఎంతటి ప్రకాశించే గుణమున్నప్పటికీ సానబడితేగాని దాని విలువ అవగతమవదు. కాబట్టి మేధావియైన దర్శకుడు శ్రీ టి.కృష్ణ దర్శకత్వంలో విజయశాంతి, వేలు, చరణ్‌రాజ్, వై.విజయ మిగతా చిన్న చిన్న పాత్రధారులందరూ ప్రకాశవంతంగా వెలిగిపోయారు. రసజ్ఞుల ప్రశంసలకు పాత్రులయ్యారు.

"*ఈ దుర్యోధన దుశ్శాసన దుర్నీతి లోకంలో*" పాట ఎస్.జానకి గారు సహజంగా, హృద్యంగా పాడిన తీరూ, వ్రాసిన వేటూరివారి ప్రతిభ ఆ సన్నివేశంలో విజయశాంతి నటనా దర్శకత్వపు ఔన్నత్యానికి గీటురాళ్ళు. ప్రతి సన్నివేశాన్ని తర్వాత ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠతో నడిపిన విధానం, అన్యాయాన్ని ప్రతిఘటించిన ఇన్స్‌పెక్టర్‌ను నడి వీధిలో గూండా హత్యచేయడమూ, వై.విజయ భర్త పాత్రను దారుణంగా చంపడమూ, పతాక సన్నివేశంలో విజయశాంతి చరణ్‌రాజ్‌ను గొడ్డలితో నరికినట్లు చూపటమూ, వేలు భార్య మరణ సన్నివేశము, గుండా నడి వీధిలో విజయశాంతిని వివస్త్రను చేయటమూ, అసభ్యంగా ఉన్నప్పటికీ అవి అలా ఉంటేనే సహజంగా, సభ్యతగా ఉంటాయి, ప్రేక్షకుల మనస్సులకు హత్తుకుపోయేలా ఉంటాయనే విధంగా చిత్రీకరించిన శ్రీ టి.కృష్ణ దర్శకత్వ నైపుణ్యం జోహార్లర్పించేలా ఉన్నది.

శరీరానికి ప్రాణముంటేనే దానికి విలువ, గుర్తింపు. ఆ విధంగా 'ప్రతిఘటన' చిత్రానికి జీవం దాని సంభాషణల కర్త శ్రీ ఎం.వి.ఎస్.హరినాథరావు.

ఈ చిత్ర విజయానికి దర్శకత్వపు ప్రతిభ, విజయశాంతి, వేలు, చరణ్‌రాజ్, తదితరుల నటనా ప్రాభవం ఒక ఎత్తయితే, సంభాషణలు మరొక ఎత్తు.

నటన, దర్శకత్వం ఎంత గొప్పగా ఉన్నప్పటికీ సంభాషణలలో జీవం లేకపోతే తేలిపోతాయి. ప్రతి పాత్ర రాణింపుకూ పదునైన, సహజమైన, జీవమున్న, పండిత పామరులను రంజింపచేసే సంభాషణలు రచించిన శ్రీ ఎమ్.వి.ఎస్.హరనాథరావును 'ప్రతిఘటన' చిత్ర విజయానికి పరోక్ష కారకుడుగా అభినందించ వలసిన అవసరం ప్రతి ఒక్కరికీ ఉన్నది.

*(సినీ ఫ్రెండ్)*

# నేనెందుకు వ్రాస్తున్నాను? శీర్షికకు...

నా ఇంట్లో, నా చుట్టుపక్కల నన్ను స్పందింపచేస్తున్న సమస్యలు అంటే వరకట్నం, మద్యపానం, ఆడవారికి ఆస్తిహక్కు, నేటి విద్య, వగైరాలపట్ల అమితంగా ప్రభావితురాలినై రచనలు చేయటం మొదలెట్టాను లేఖలు, కవిత, వ్యాసం, కథారూపంలో. నా రచనలవల్ల ఏ ఒక్కరైనా మారాలని నా ఆశ. అంతేకానీ కమర్షియల్ దృక్పథంతో నేను రచనలు చేయాలనుకోవటం లేదు. యికముందు అలా అనుకోను కూడా.

పూర్వం ఆంధ్రపత్రిక, పురాణం సుబ్రహ్మణ్యశర్మగారి ఆధ్వర్యంలో ఆంధ్రజ్యోతి... రచనల సత్తాను బట్టి రైటర్స్‌ను ప్రోత్సహించేవి. అందువల్లే సమాజంలోని వివిధ సమస్యలను ఆవిష్కరింపచేస్తూ నేను వ్రాసిన రచనలు ప్రచురితమయ్యాయి నాకు సంతృప్తికరంగా ఉండేలా, పలువురు మెచ్చేలా. అలా 'విశ్వసాహితి' ఆధ్వర్యంలో డా.పోతుకూచి సాంబశివరావుగారి అధ్యక్షతన నా వ్యాససుమమాల, 'సంగీతజ్ఞానము' గ్రంథాలు ఆవిష్కరింపబడి, డా॥ పోతుకూచి సాంబశివరావు, మహారథి గారు, వగైరా ప్రముఖుల ప్రశంసల నందుకున్నాయి. ఈనాడు 'సాహితీ యువరత్న' అవార్డును అందుకునే అర్హతను కల్గించాయి. ఏ రచనైనా చక్కని సందేశాన్ని సమాజానికి అందివ్వగలగాలి కానీ, సమస్యను పాఠకులకే వదలివేయకూడదనేది నా ఉద్దేశ్యం.

ఈనాడు పత్రికల ధోరణులెలా ఉన్నాయో యిక్కడ ఉన్న రచయితలందరికీ అనుభవైక వేద్యమే. ఈ సమయంలో 'విశ్వసాహితి' ద్వారా డా.పోతుకూచి సాంబశివరావుగారు ఎందరో కొత్త రచయితలను ప్రోత్సహిస్తున్నారు. అలాగే మిగతా సంస్థలూ, పత్రికలూ నిష్పక్షపాతంగా కొత్త రచయితల పట్ల వ్యవహరిస్తూ, వారిని వృద్ధిలోకి తేవాలని నా అభిలాష.

*(విశ్వసాహితీ ఆధ్వర్యంలో 12వ నవ యువ రచయితల సమాఖ్య 1995 సందర్భంగా సాహితీయువరత్న అవార్డు అందుకున్న సమయంలో)*

*(తేదీ: 14.5.95 సిటీసెంట్రల్ లైబ్రరీ, అశోక్‌నగర్‌లో)*

# 1994 సంవత్సరపు కథాసమీక్ష

కథారచన చాలా రచనా ప్రక్రియల్లోకల్లా కష్టతరమైనది. నవలల్లో అయితే రచయిత తననుకున్న భావాలను కొన్ని పాత్రలద్వారానో, మరెక్కడనో యిరికించి ధారాళంగా చెప్పగలడు.

కానీ కథలో పత్రికలు ప్రకటించినన్ని పేజీలలోనే కుదించి శిల్పం చెడకుండా వ్రాయటం ఎంత కష్టమో ప్రతి కథకుడికీ తెలుసు.

మనకున్న కొన్ని ముఖ్య పత్రికలలో కొన్ని శృంగారానికి ప్రాధాన్యత నిస్తున్నాయి పత్రిక సర్క్యులేషన్ పెంచుకోటాన్కి దానికి తగ్గట్టే యువతీ యువకుల మనసులను జివ్వుమనిపించేలా ఆర్టిస్టులతో అనేక శృంగార భంగిమలతో బొమ్మలు వేయింప జేస్తూనూ.

కొన్ని పత్రికలు ప్రత్యేక శీర్షికలు పెట్టి పాతతరంవారివీ, ఈ తరంవారివీ ప్రచురిస్తున్నాయి మంచి కథలు కొన్నింటిని.

ఇహపోతే రచయితలు ఎవరికివారు తమ ప్రతిభా పాటవాల్ని గురించి చెప్పుకోకపోతే ఎవరూ ముందుకొచ్చి యీ తరం వారిని ప్రశంసించరు కాబట్టి ఎన్ని ఎక్కువ కథా సంపుటాలు రిలీజ్ చేస్తే అంత ప్రఖ్యాత రచయిత మరొకరు లేరనుకోకుండా కథల్లో సత్తావున్న వారినే గుర్తించాలి విజ్ఞులు అంటే రచనలు మంచివి చేసినవారన్న మాట.

1994లో ప్రచురితమైన నా రచనల గురించి కొద్దిగా ప్రస్తావిస్తాను. నాకు సమాజంలోని అన్ని సమస్యలనూ 'టచ్'చేసి, తగిన సందేశాన్నివ్వాలని ఉంటుంది. అది లేఖ, వ్యాసం, కవిత, కథ ఏ రూపంలోనైనా సరే.

'ఉదయం' డైలీలో ప్రచురించబడిన 'సుశీల' కథ ఎక్కువగా ఆఫీసుల్లో స్త్రీలు ఒళ్ళువంచి మగవారికంటే ఎక్కువగా పనిచేస్తూ కూడా తమ పై అధికారుల అహంకారాలకూ, అసభ్య ప్రవర్తనకూ బలవుతూ పైకి చెప్పుకోలేక సతమతమయ్యే వ్యక్తులకు ప్రతీకగా 'సుశీల'ను సృష్టించటం జరిగింది.

అలాగే యీ రోజుల్లో పిల్లల పట్ల తల్లులు క్రూరంగా వ్యవహరిస్తే ఆ పిల్లల భవిష్యత్తు ఎంత దారుణంగా ఉంటుందో 'తల్లే రాక్షసైతే'లో యీనాటి చాలామంది తల్లులకు

ఉదాహరణగా 'వనజ' పాత్రద్వారా చెప్పటం జరిగింది. (మయూరి వీక్లీ ప్రచురణ)

ఆ తర్వాత నేను ఎంతో శ్రమించి వ్రాసిన కథ 'వైద్యో నారాయణో హరిః'. ఆ కథను ఒక మెడికల్ స్టూడెంట్‌కు కూడా తెలియని విధంగా వ్రాసిన మందులు, వైద్య విధానం, కథను నడిపించిన తీరూ ఎంతో బాగుందంటూ నాకు అభిమానుల నుండి ఉత్తరాలు వస్తుంటాయి. ప్రతి డాక్టరూ నేను సృష్టించిన డా.గోపీకృష్ణలాగా, అందరి స్పెషలిస్టులనూ ఒకచోట సమకూర్చాలంటే నర్సింగ్ హోమ్ అంటూ ఉండాలి కాబట్టి ఆ నర్సింగ్‌హోమ్ ఎలా ఆదర్శంగా, శుభ్రతగా ఉండాలో విపులంగా వివరించటం జరిగింది యీ కథలో *(మయూరి వీక్లీ ప్రచురణ).*

చివరగా పత్రికల కొకమాట. కొన్ని కథలు తీసుకున్న సబ్జక్ట్‌ను బట్టి విపులంగా వ్రాయాలంటే పది, పన్నెండు పేజీలకంటే ఎక్కువగా వ్రాయాల్సుంటుంది. కుదిస్తే అనుకున్న ఫలితం రాదు. స్థలాభావం అని సాకు చెప్పకుండా, కథాభావం చెడేట్లు 'ఎడిట్' చేయకుండా పేజీల సంఖ్యను పెంచాల్సిన అవసరం ఎంతైనా ఉంది. పరభాషా కథలను తెలుగులోకి అనువదించి వేస్తున్న పత్రికలు మన తెలుగు భాషలోని మంచి రచనలను కూడా అనువదించే అవకాశం కల్పిస్తూ ప్రకటనలు చేసి వేరే భాషా పత్రికలలో పడేలా ఆచరిస్తే తెలుగు రచన ఏ భాషకూ తీసిపోదని మిగతా భాషల వారికర్థమవుతుంది. అంత ర్జాతీయంగా ప్రముఖంగా చెప్పుకో బడుతుంది. ముఖ్యంగా యీ తరంలోనూ చక్కగా వ్రాసే రచయితల రచనలకు యీ అవకాశం తప్పక కల్గించాలి, ఎంతసేపటికీ సభల్లో ఆ తరాన్నే కీర్తించుకుంటూ కూచోకుండా. ఎందుకంటే అప్పటివారివి ఎటూ ప్రాచుర్యాన్ని పొందే ఉన్నాయి కాబట్టి.

*(విశ్వ రచన కోసం వ్రాయబడింది)*

# Doctors with the touch of life

**HYDERABAD :The Jagadamba Nursing Home** situated at Gandhinagar near Ashok nagar is famous for its dedicated services of the Doctors and the good treatment given to the patients.

Under the guidance of the Managing Director, a team of talentedGynaecologist, General Surgeon (Managing Director) and resident doctors, a complicated surgery was performed on a 65-year-old woman who was suffering from "Ovarian Cancer" (Gys.IIIC). Because of their efficiency, the operation was an instant success.She was also treated for pelvis infection through Cauterisation and by giving some powerfulmedicines. Later a famous Oncologist treated her by giving"Chemotherapy" so as to prolong her life span by giving her latest medicines to destroy the cancer cells.

It is evident that the patients admitted in Jagadamba Nursing Home get the best quality treatment at affordable prices. The resident doctors and consultants take keen interest in treating the patients. A team of doctors from the Nursing Home regularly visit rural areas once a month to serve the needy there.

(citizen's Evening, 27.7.93)



# మరపురాని అనుభవాలు

## మీరే చెప్పండి? చేతబడి చేస్తారా?

చంపేస్తున్నారు....పట్టుకోండి
మామేనమామకు పెళ్లయిన ఏడాదికే భార్య చనిపోయింది. తర్వాత ఆయనమరో ఆమెను పెళ్లిచేసుకున్నాడు. ఆమె వయసులో చిన్నది - అందంగా ఉంటుంది. మా మేనమామ దగ్గర్లో ఉన్న బస్తీలో టీచర్‌గా పన్చేస్తుండేవారు. మా మేనమామ భార్య సెలవులకు యింటికి వెళ్ళిన మరుదులతో అక్రమసంబంధం పెట్టుకునేది. ఈ విషయం మా మామయ్యకు తెలీదు.
ఒకసారి ఉన్నట్టుండి మా మామయ్యను క్వాలిఫైడ్ కాదని ఉద్యోగం నుంచి తీసేశారు. అందువల్ల ఆయన భార్య, యిద్దరు పిల్లలు ఆమె తలిదండ్రుల దగ్గరకు చేరారు. అక్కడ ఆయన భార్య మరో అతనితో అక్రమ సంబంధం పెట్టుకుంది. ఈ విషయం మా మామయ్యకు తెల్సింది. ఆయన ఆమెను తిట్టాడు, కొట్టాడు. ఆమె కోపంతో తన ప్రియుడితో కల్సి మామయ్యకు చేతబడి చేయించింది. ఆయన వెంటనే ఆ ఊరు వదలి మాయింటికి వచ్చేశాడు. ఎప్పుడూ తన పిల్లల్ని కలవరించేవాడు."నన్నెవరో చంపుతున్నారు. నాపిల్లల్ని నాకుదూరం చేస్తున్నారు. పట్టుకోండి "అంటూ అరిచేవాడు. తిండి ధ్యాస ఉండేది కాదు. ఎప్పుడూ ప్రక్క ఊళ్ల వెంట తిరుగుతుండే వాడు. అలా తిరిగి తిరిగి బలహీనుడై చివరకి రక్తం కక్కుకుని ఘోరంగా చనిపోయాడు. ఇది మేము ఎన్నటికీ మరచిపోలేని విషాద కరమైన సంఘటన.

*(చాలా మార్చి కుదించి - 17.8.78 ఆంధ్రభూమి వీక్లీలో ప్రచురించారు)*

## అరుదైన ఆటోగ్రాఫ్

అవి 'శంకరాభరణం' సినిమా విడుదలై సంచలనం సృష్టిస్తూ శంకరశాస్త్రిగా నటించిన జె.వి. సోమయాజులుగార్కి అభిమానులు సన్మాన సభలలో సాష్టాంగ ప్రణామాలు అర్పిస్తున్న రోజులు. తేదీ 14.6.80న వారు రామప్ప పంతులుగానూ, వారి సోదరుడు రమణ మూర్తిగారు గిరీశంగానూ నటిస్తున్న 'కన్యాశుల్కం' నాటకం చూడటానికి 'రైల్ కళారంగ్' కెళ్ళాము. అక్కడ ఒక రూమ్‌లో కూర్చుని ఉన్నారు పాత్రధారులంతా, కిటికీలో నుండి చూశాం అందర్నీ. సోమయాజులు గారి ఆటోగ్రాఫ్ తీసుకోవటం కష్టమైందారోజు. వేరే ఒకరి ద్వారా పుస్తకాన్ని లోపలకు పంపించి, ఎలాగైతేనాం సంపాదించాం. *(ఆ నాటకం వానమూలంగా త్యాగరాయ గాన సభలో ప్రదర్శించబడింది).* ఆ అరుదైన ఆటోగ్రాఫ్‌ను నేను ఎప్పటికీ మరచిపోను.

*(ఉదయం, తేదీ 3.1.88)*

## మరపురాని కల

నా చిన్నతనంలో తరచుగా ఒక కలవస్తుం డేది. మా బావిదగ్గర ఉండే గట్టువద్ద నీళ్లలోనూ, రోడ్డుమీదా, మట్టిలో

సగం కూరుకు పోయినట్లుగా అర్థణా, అణా, పావలా, నాణేలు కన్పిస్తుండేవి. ఏరుకుంటుంటే ఇంకా వస్తుండేవి అబ్బా! ఎన్ని డబ్బులో! అనుకునే దాన్ని. ఆ తర్వాత మారుతున్న కాలంలో పది, ఇరవై పైసల నాణేలు కనిస్తుండేవి అలాగే. ఆర్థిక స్తోమత అంతగా లేకపోవటాన్ని ఇలాంటి కలలు సూచిస్తాయేమోమరి! నేనెప్పుడూ చూడని ప్రదేశాలు. ఇరుకు మెట్లగుండా పెద్దపెద్ద అంతస్థు లెక్కవలసి రావటం, ఎంతో ఎత్తుపైనుండి కిందపడి పోతున్నట్లు, శవాల గుట్టల మధ్యలో వెళ్తున్నట్లూ, ఏప్పుడో చనిపోయిన మా తాతయ్య, మామయ్యలు బ్రతికున్నట్లూ, నేను వాళ్లింటి కెళ్లినట్లూ, పరీక్షలు జరుగుతుంటే వెళ్లలేక చివరి నిముషంలో వెళ్లిఎట్లా వ్రాయగలనబ్బా! అని ఆందోళన పడుతున్నట్లూ కూడా కలలు వచ్చేవి. దైనందిన జీవితంలో ఎన్నో సమస్యలుంటాయి గదా! సభ్యత అడ్డు వచ్చి, మనం ఎవర్నీ ఏమీ అనలేని సంఘటనలు ఎదురౌతుంటాయి. కానీ ఎవర్నీ మనం ఎదిరించి అనలేకపోతామో అవన్నీ కసిదీరా అనేసినట్లుగా కలవస్తుంది. దాంతో మానసిక తృప్తి కలుగుతుంటుంది. నేను ఇప్పటికీ భయపడే మరొక కల ఉన్నది. టీకాలంటే భయం నాకు. పదకొండేళ్ల వయసులో వేయించారు నాకు మా పెద్దవాళ్లు. అధికారులొచ్చినప్పుడు దాచి పెట్టేవారు నాకేదో అవుతుందనే భయంతో ఆ భయం నా నరనరాల్లో జీర్ణించుకుపోవటంవల్ల టీకాలు వేసే అతను మా విశాలమైన (స్వగ్రామంలో) ఆవరణలోని పెద్ద వేపచెట్టు మీద ఎక్కి కూర్చుని భయపెడుతున్నట్లూ. నేనది చూసి గజగజవణుకుతున్నట్లూ తరచుగా కలవస్తూ దడపుట్టిస్తుంది. నా మానసిక దౌర్భల్యాన్ని అనారోగ్యాన్ని సూచిస్తాయేమో ఈ రకం కలలు అనుకుంటాను. అన్నింటికంటే మరపురాని మరొక కల నేను చదువుకునే రోజుల్లో (దాదాపు పాతికేళ్ల క్రితం) వచ్చింది. చందమామ (చంద్రుడు) కొన్ని ముక్కలై, నాలుగు దిక్కులుగా ఉన్నట్లుగానూ, అనంతమైన సముద్రంలో ప్రతిబింబిస్తూ ఎటుచూసినా కన్పిస్తూ ఉంటుంది.

అన్నివైపులా నీరే ఉంటుంది. ఆకాశంమీద పెద్ద పెద్ద అక్షరాలు వ్రాసి ఉంటాయి. భయంకరంగా దడగా ఉండి ఒళ్లంతా చెమటలుపట్టి క్రమంగా మెలకువ వచ్చేస్తుంది. గ్రహాల గతులుమారి యుగాంతంలో ఇలా జరుగుతుందేమో అనన్పిస్తుంది నాకు. చందమామను నీళ్లల్లో చూడాలంటే ఇప్పటికీ వెన్ను జలదరిస్తుంది.

*('ఉదయం' తేది 28.2.88)*

## వెంటాడే అనుభవం

అవి నేను థర్డ్‌ఫారం చదివే రోజులు. దసరా సెలవులకు మేం చదువుకునే ఊరికి దగ్గర్లోనే ఉన్న మా స్వగ్రామానికి వెళ్లడం ఆనవాయితీమాకు. నవరాత్రుల రెండో రోజు నాపుట్టినరోజు. తలంటిపోసింది మా అమ్మ. కొత్త బట్టలు కట్టుకున్నాను. సాయంత్రం నాలుగ్గంటలు కావొస్తుంది. పండుగకు కట్టుకోబోయే కొత్త బట్టలు, వగైరా సంచుల్లో సర్దిపెట్టింది. మా అమ్మ "ఈ రోజే ఊరికి పోదాం" అన్నది. "బాగా

మబ్బులు పట్టి ఉన్నాయి. పెద్దవాన వచ్చేట్లుంది. రేపు వెళ్దురుగానీ, పైగా రెండు వాగులు దాటి వెళ్లాలయ్యో" అంటూ మా అవ్వ, చుట్టు ప్రక్కలవాళ్లు నచ్చచెప్పారు. మా అమ్మకు. మా అమ్మ ఎందుకో మూర్ఖంగా పట్టుబట్టి బయల్దేరదీసింది. ఊరి చివర దోర్న వాగు ఉన్నది. అది దాటి, యివలత కొచ్చామో లేదో, నల్ల చీకటికి మారురూపాల్లా ఉన్న కారుమేఘాలు వర్షించడం మొద లెట్టాయి. హోరు మని వీస్తున్నగాలికి అడుగులు పడటంలేదు. పెద్దపెద్ద చినుకులు చిన్నసైజు కత్తుల్లా శరీరాన్ని బాధిస్తూన్నాయి. కళ్లు మిరుమిట్లు గొల్పే మెరుపులు, గుండె దడదడ లాడించే ఉరుములతో భయంకరంగా ఉంది వాతా వరణం. కొంత దూరం నడిచి, ఒక చిన్న తుమ్మచెట్టుక్రింద నిలబడ్డాం మా అమ్మా, నేను, మా తమ్ముడు. అంతలో అక్కడే పిడుగుపడిందా! అన్నట్లు పెద్ద శబ్దమైంది. అదిరిపోయి, భగవంతుణ్ణి ప్రార్థించు కుంటూ, చలికి గజగజవణు కుతూ ఉండి పోయాం. పెద్దల మాట వినకుండా వచ్చినం దుకు తగిన శాస్తే జరిగిందన్పించింది. ఊడ్చి కొడుతున్న వాన కాస్త తగ్గుముఖం పట్టింది. మళ్లీ నడవటం మొదలెట్టాం.

అల్లంత దూరంలో మా ఊరు కన్పిస్తున్నది. కానీ ఊరు చేరాలంటే ఉధృతంగా ప్రవహి స్తున్న "చిలకలేరు" దాటాలి. ఆ రోజు మా అమ్మనేం ఆవహించిందో కానీ కాసేపుకూడా ఆగకుండా మా యిద్దర్నీ చెరోరెక్క పుచ్చు కుని వాగుదాటటానికని ఒడ్డుకొచ్చి నిల బడింది. "ఓసుబ్బమ్మో! రామాకండి. అక్కడే నిలబడిండి. నేను వస్తున్నా" నంటూ అవతల ఒడ్డునుండి దూరంగాకేక విన బడింది భగవంతుని రూపమా! అన్పించేట్లు. అతను మా ఊరి రైతు నానయ్య చాలా పొడవుగా. బలంగా ఉంటాడు. అక్కడ కొందరున్నారు. కానీ యితనే ధైర్యం చేసి వచ్చాడు, ఏటికి ఎదురీదుతూ. మాతమ్ముణ్ని భుజంమీద కెక్కించుకుని మా అమ్మనూ, నన్ను చెరో చేత్తో పట్టుకుని ఏరుదాటి స్తున్నాడు. ఏరు మధ్యలో కొచ్చేసరికి ప్రవా హం బాగా వేగాన్నందుకున్నది. అతను ముందుకు అడుగులేస్తూ వెయ్యి ఏనుగుల బలంతో ఒక్క గుంజుగుంజాడు మమ్మల్ని. ఆ దెబ్బతో అవతలొడ్డుకొచ్చిపడ్డాం. "తండ్రిలేక పోయినా పిల్లల్ని బాగా చదివిస్తూ కూడా, ఏటిపాల్జేసేదానివి కదమ్మా యీరోజు, నేను లేకపోతే ఇందాకటి పిడుగు పాటుకు మా గొర్రెలన్నీ చచ్చిపోతే ఎటూ తోచక ఊళ్లోకి, పోబోతున్న మాకు దూరంగా మీరు కన్పించే సరికి ఆగిపోయాం. పంతు లుగారు చేసిన పూజలే మిమ్మల్నాదు కున్నాయి." అన్నాడు నానయ్య. రెండు మూడు గంటలు కదనకుతూహల రాగాన్ని ఆలపించిన వానదెబ్బకు పూరి గుడిసెలు నేలమట్ట మయ్యాయి. భీభత్సంగా ఉంది ఊరు. అంతవర్షంలో బయలుదేరి బతికి, బయట పడొచ్చిన మమ్మల్ని వింతగా చూశారు చాలా మంది. 'అసలు పిడుగులు చెట్టుమీదే పడ్తాయి. చెట్టుకిందెందుకు కూర్చున్నారు?' అంటూ చనువుగా మందలించారు మా అమ్మను. జరిగిందంతా విని. అన్ని గంటలు నానటం వల్ల ఒణుకు ఎక్కువగా ఉన్నది నాకు. అది ఆమరుసటిరోజుకు తగ్గలేదు. ఆ

సంఘటన తల్చుకుంటే యిప్పటికీ భయంగానే ఉంటుంది నాకు.

(ఉదయం తే. 11.10.87)

## వెంటాడే అనుభవం

పి.యుసి. పరీక్షలయిెం తర్వాత వైజాగ్ నుండి మా పిన్నిగారి ఊరు రజానగరం కొచ్చాం సెలవులకు.

మేం ఎక్కడి కెళ్ళినా వర్షం రావటం ఆనవాయితీ. అక్కడికి సుమారు 7 మైళ్ళదూరంలోగల అద్దంకిలో మా పెద్ద నాన్న కొడుకువాళ్ళున్నారు. చాలా సంవత్సరాలయిందిగదా వాళ్ళని చూడాలని ఒకరోజు బయలుదేరాం. ఉన్నట్టుండి పెద్దవాన, హోరుగాలి పట్టుకున్నాయి. చురకత్తుల్లాంటి చినుకులు శరీరానికి గుచ్చుకుంటున్నాయి. అడుగులు పడటమే కష్టంగా ఉంది. పెద్ద పెద్ద ఉరుములూ, మెరుపులూనూ, పైగా గుండ్లకమ్మనది దాటాలి. ఆ సుడిగుండాలూ. తెప్పకొయ్యల మీద ప్రాణాలకు తెగించి దాటిన అనుభవాలు గుర్తొస్తే దడగా ఉంటుంది. వాన మొదట్లోనే ఉందికాబట్టి గొంతులోతు వీళ్ళల్లో ఎలాగో గుండ్లకమ్మ దాటగలిగాం. ఇల్లు కనుక్కోలేక వానను తప్పించు కోవటానికని సినిమా హాలులో కెళ్ళాం. అరవ సినిమా - తెలుగు డబ్బింగ్‌ది. బెంచీల మీదకూర్చోటమొక బాధ. తడిసిన బట్టలు విపరీతంగా వణుకును కల్గిస్తున్నాయి. గూబ పగిలేలా రీసౌండ్ యిస్తుండటంవల్ల సినిమా చూసినంత సేపూ చెవుల్లో వేళ్ళు పెట్టుకుని కూర్చుని ఉన్నాను.

అదయింతర్వాత ఆ వానలోనే తడుసు కుంటూ మా అన్నయ్య వాళ్ళింటి కెళ్ళాం. కానీ నాగుండె చప్పుడు నాకే విన్పిస్తూ డదడగా ఉన్నది. తలలో పెద్ద హోరు, జ్వరమూనూ. మర్నాడు కష్టంమీద మా పిన్నిగారింటికి వచ్చినా. అదే పరిస్థితి. దిక్కుతోచక భయంతో చెమటలు పట్టేవి. నేను రానంటున్నా వినకుండా ఆ ఊరికి, ముఖ్యంగా సినిమాకు తీసికెళ్ళిన మా అమ్మా వాళ్ళమీద కోపమొచ్చింది నాకు. ఆ ఊర్లోని డాక్టరు, బి.కాంప్లెక్స్ ఇంజక్షన్లనీ ఇచ్చాడు. చాలా ప్రమాదం తప్పిందన్నాడు. గుండెదడ మాత్రం తగ్గింది కానీ, తలలో హోరు, చెవులలోగుండా పిట్టలెగిరిపోతూ ఉంటే వచ్చే బుర్‌మన్న శబ్దాలూ, కీచురాళ్ళు అరుస్తున్న శబ్దాలూ వినవస్తుండేవి. మొదట్లో రెండు మూడేళ్ళు ఆ శబ్దాలు వింటూ నిద్రకూడా పోలేకపోయేదాన్ని భయంతో. ఇప్పుడు అలవాటైపోయింది. కానీ బలహీనంగా ఉన్నప్పుడు మాత్రం ఆ మోతలు భయాన్ని కల్గిస్తూనే ఉంటాయి. డాక్టరుకు చూపించుకున్నా లాభం లేకపోయింది.

(ఉదయం 13.3.1988)

## కాలేజీ కీ కహాని

వైజాగ్‌లోని సెయింట్ జోసెఫ్ కాలేజీలో నేను పి.యు.సి.లో చేరిన రోజు అది. అదే పేరుతో కాన్వెంట్ కూడా ఉందక్కడే. మేముండే అల్లిపురం నుండి కాలేజికి బయలు దేరి వెళ్తూ ఉన్నాను. దారిలో ఐదు సంవత్సరాల వయస్సుగల చిన్నపాప నన్నుచూసి "వాట్ ఈజ్ యువర్ నేమ్"? అన్నది. చెప్పాను. ఇంకా ఏవో ఇంగ్లీషులో అడిగింది. జవాబులు తెలిసే సమాధానం చెప్పకుండా మౌనంగా ఉండిపోయాను.

ఇంగ్లీషులో నోరుతెరిచి మాట్లాడలేని అశక్తత. ఇంగ్లీష్ ఫోబియా నాకు. కాలేజీ దగ్గర పడుతోంది. ఆ అమ్మాయికి విసుగొచ్చి!'' ఆర్ యు డెఫ్ అర్ డంబ్?'' అన్నది కోపంగా దానికీ మాట్లాడలేదు నేను. నా నవనాడులు కృంగిపోతున్న ఫీలింగ్ ' ఈ పిల్ల రోజూ యిలాగే వేధిస్తుందేమో నన్ను! ఎలా తప్పించుకోవాలి ఆ అమ్మాయిని, ఇద్దరికీ ఒకటే టైమ్' అని ఆలోచిస్తూ క్లాస్‌రూంవేపు చకచక వెళ్ళి పోయాను. ఎవరైనా ఇంగ్లీషులో పలకరి స్తారేమోనను కుంటూ, ఎవరితోనూ ఎక్కువ మాట్లాడకుండా భయంభయంగా బిక్కు బిక్కు మంటూ గడిపాను ఆ రోజంతా (సంవత్సరమంతా కూడాలేండి!)

*(ఉదయం తేదీ 3.4.88)*

## మరపురాని సంఘటన

అవి నేను కమలా నెహ్రూ మునిసిపల్ గరల్స్ హైస్కూలు, విశాఖపట్టణంలో ఎస్.ఎస్.ఎల్.సి. చదివే రోజులు. ఫిఫ్త్‌ఫారం వరకూ ఒక పల్లెటూరులో చదివిన నేను ఒక్కసారిగా పట్నం బడిలో చదవటం సిగ్గరినైన నాకు చాలా జంకుగా అన్పించేది. అలా ఉన్నప్పటికి నాలోని టాలెంట్స్ - అంటే పాటలు పాడటం, డిబేటింగ్‌లో పాల్గొనటం, గేమ్స్‌లో ముందుండటం, వ్యాసరచన పోటీలలో చిత్రలేఖనంలో బహుమతులు పొందటం లాంటి వాటివల్ల టీచర్లకూ, సాటి స్టూడెంట్స్‌కూ, మొత్తం స్కూల్లోనే అందరికీ అభిమాన పాత్రురాలి నయ్యాను. లెక్కలలో ఆడపిల్లలు వెనుకబడి ఉన్న ఆరోజులలో నేను కాంపోజిట్ మేథ్స్ తీసుకోవటం ఒక గొప్పతనంగా ఉండేది. అలాంటి వాళ్లం క్లాసులో ఐదారుగురు మాత్రమే ఉండేవాళ్లం. సుగుణమణి అనే టీచరు గారు ఇంగ్లీషూ, కాంపోజిట్ మేథ్స్ క్లాసులకు వచ్చేవారు.

పల్లెటూరునుండి వెళ్లిన నాకు చెప్పు లేసుకోవటమంటే బెరుకు, పైగా మా బాగోగులు చూస్తున్న మా మేనమామ ఏకంగా హైహీల్స్ ఉన్న బెల్ట్‌బూట్ కొన్నాడు. అవి వేసుకోటాన్కి చికాగ్గా అన్పించి మా అల్లిపురం నుండి నాతో వచ్చే అమ్మాయి కివ్వటమో (మా మామయ్య చూడకుండా) లేక ఊడదీసి యింటికెళ్లేదాకా ఒకచోట పెట్టటమో చేస్తుండేదాన్ని.

ఒకరోజు మా సుగుణమణి టీచర్ గారు అన్నింటికంటే పైనున్న ఫ్లోర్‌లో చిన్నరూమ్ ఖాళీగా ఉంటే అక్కడ మాకు లెక్కల క్లాసు తీసుకున్నారు. నేను బూట్లు విప్పి అక్కడే చిన్న మూతలేని షెల్ఫ్ ఉంటే క్రింద అరలో పెట్టాను. ఉండుండి ముక్కుపుటాలు పగిలేలా 'అశుద్ధం' వాసన రాసాగింది. అందరికీ. నేనూ తట్టుకోలేకపోతున్నాను. కానీ ఎక్కడ్నించి వస్తుందో అర్థం చేసుకోలేక పోయాను. ఉన్నట్లుండి షార్ప్ మెంటాలిటీ కల్గిన మా టీచర్ చూపు నా బూట్లపై పడింది. "ఎవరివి?'' అని గద్దించారు. "నావే టీచర్'' అన్నాను. "అక్కడ పెట్టొచ్చా'' అన్నారు. అవి వేసుకోవటం, క్రింద కూచోటం యిబ్బందని చెప్పలేక పోయాను. "తీసిచూడు'' అన్నారామె. చూద్దునుగదా! బూట్ల అడుగున మనిషి మలమున్నది. నేను ఎక్కడో తొక్కాను. "క్రిందకెళ్లి కడుక్కురా'' అన్నారు సుగుణ మణి. మిగతా

స్టూడెంట్స్ నావేపు అదోలా చూస్తున్నారు. నాకు చాలా చిన్నతనంగా అన్పించింది. ముఖం మ్లానమైంది. ఈ సంఘటన ఎప్పటికీ ముల్లులా నా మనసును తాకుతునే ఉంటుంది.

(విశ్వరచన)

## మరపురాని "ఒక అనుభవం"

నేనవి సెకండ్‌ఫారం చదివే రోజులు. మెచ్యూర్ అవటం కూడా ఆరోజుల్లోనే జరిగింది. అప్పట్నించీ కడుపు నొప్పిలాంటి తదితర రోగాలు, తరచూ దయ్యాలు కలలోకి రావటం, భయంతో నిద్ర నుండి మేల్కొనటం జరుగుతుండేది.

ఒక రోజు రాత్రి ఎనిమిదిన్నర అయింది. నా క్లాస్‌మేట్స్ అయిన మహలక్ష్మి, ఇందిర, రమ, రత్న, వగైరాలు మాయింటి కొచ్చారు. "మన రచ్చబండపై పాటలపోటీలు జరుగుతున్నాయి. నువ్వు తప్పకుండా రావాలి" అంటూ నేను రానన్నా వినకుండా ఉన్న ఫళాన తీసుకువెళ్లారు. వాళ్లకూ, నాకూ కొన్ని అడుగుల దూరం మాత్రమే ఉండ నగా- ఒక్క సారిగా సుడిగాలి చుట్టు ముట్టింది నన్ను. నేలపై నుండి రెండడుగుల పైకి లేచికొద్ది దూరం అలా వెళ్లి, నేలపై నిల్చున్నాను. చెమటలు పట్టాయి ఒళ్లంతా జలదరింపుతో. మూత్రంతో పరికిణీ తడిసి పోయింది. వాళ్లకు చెప్పి, నేనురాలేనన్నాను. " అదేముంది? గాలి ఒత్తిడికి అలా జరిగి ఉంటుంది, సుడిగాలి దయ్యమెలా అవుతుందని నాతో వాదించి లాక్కు పోయారు. నేను బాగా పాడతానని మా స్కూల్లో మంచి పేరుండేది.

పోటీలు జరిగే చోటుకొచ్చాం. మధ్యలో వేపచెట్టు. దాని చుట్టూ కట్టిన గట్టుపై బండలు పరచి ఉన్నాయి. దాని మీదే వేసిన కుర్చీలలో బి.డి.ఒ, మా హెడ్మాష్టరూ, మరి కొందరు మాష్టర్లు, వి.డి.వోలు కూర్చుని ఉన్నారు. అప్పుడు పాటల పోటీ మొదలైంది. వి.డి.వో గారొకరూ, మరి కొందరు పాల్గొన్నారు. నేను "సాకేత రామ....." అనే పాట పాడాను. ఆసుడిగాలి భయంతో సరిగా పాడినో లేదో నన్పించింది. కానీ నాకు ఫస్ట్ ప్రయిజ్, వి.డి.వి. గారికి సెకండ్ ప్రయిజ్ వచ్చింది. అందరూ అభినందించారు. ఆ సుడిగాలి దయ్యమని నమ్మినా దానివల్ల నాకారోజు మంచి జరిగినట్లే లెక్క కదా! దేముడ్నెలా నమ్ముతున్నామో, దయ్యాలున్నాయనీ నాకు జరిగిన, నేను విన్న అనుభవాలవల్ల తెలుసుకున్నాను.

(మయూరి వీక్లీ తేది 3.1.97)

## మరచిపోలేని సంఘటన

1981 సంవత్సరంలో మాయింట్లో తెల్లగా, బొద్దుగా ఉండే ఒక ఆడపిల్లి ఉండేది. దానికి మాంసం అలవాటు చేశారు యింటాయన. కొన్నాళ్లకు యీయన అక్కగారి కూతురు యీయన చెల్లెలింటికి చుట్టంచూపుగా వచ్చింది. ఎంతో దూరంలో ఉన్నవాళ్లంటికెళ్లి ఆ అమ్మాయితో సరసాలాడుతూ యిద్దరూ కళ్లల్లోకి చూసుకుంటూ కాలమే మర్చిపోయేవారని మా ఆడపడుచు కూతురు చెప్పింది నాతో ఒకసారి ఏ పదకొండు దాటాకో యిల్లు చేరేవాడీయన. ఆ పిల్లిని కన్నా అని పిల్చేవాళ్లం. తరచుగా అది చూసీచూసీ

ఎటోవెళ్లి తెల్లవారుఝామున వచ్చి నా వద్ద పడుకునేది. భయస్తురాలినైన నేను అది నావద్ద ఉంటే ధైర్యంగా, తోడుగా అన్పించేది. కొన్ని భయాలు దానివల్ల (ఒక్కదాన్నే పడుకోవటాన్కి భయపడటం లాంటివి) వదలి పోయాయినాకు.

తెల్లవారింతర్వాత అతను తెచ్చిన మాంసం చద్దివాసన వచ్చేది. ఆకలితో అది తిని తరచూ పచ్చిగడ్డి తిని వాంతులు చేసుకునేది కన్నా. జీర్ణకోశం ఆవిధంగా పాడయింది దానికి. మాయింటెదురుగా ఉండే వాళ్లు దాన్ని మేము ముద్దు చేయటాన్ని సహించే వాళ్లుకాదు. అది అక్కడే తిరుగుతుండేది కదా! ఎలుకలకు మందుపెడితే అవి ఛస్తే దీనికి పెట్టారు ఒకసారి. ఆకలితో ఉన్న కన్నా ఆ ఎలుకలుతిని అనారోగ్యం పాలయింది. ఆ రోజు నవంబరు ఒకటి. నామన సెందుకో కీడుని శంకించసాగింది. కన్నాకు లూజ్ మోషన్స్, వాంతులవుతున్నాయి. ఇంక ఒకటి, రెండు గంటలకు చనిపోతుందనగా పడుతూ, లేస్తూ అది డాబా ఎక్కి చుట్టూ చూసివచ్చింది. ఎందుకంటే వేరే పిల్లుల్ని రానిచ్చేది కాదు కదా! కుక్కలా యింటిని కాపాడేది. ఆ స్థితిలో అది చూపిన కృతజ్ఞతకు నామనసు చలించి పోయింది.

చివరకు పడక్కుర్చీలో పడుకున్నది వచ్చి, ఇంతలో అతనొచ్చాడు. అతని వద్దకు మాలిమితో దగ్గరకు రాబోయి, క్రిందపడి పోయింది నీరసంతో. తన ఒళ్లో చనిపోయింది? మనిషిపోతే కూడా బాధపడనంతగా దుఃఖించాం మేము.

జంతువులను పెంచుకోటంకాదు, వాటికి వేళకు అలవాటుచేసిన తిండి పెడుతూ జాగ్రత్తగా చూసుకోవాలనీ, నీ అక్క కూతురి ప్రేమ చూపుల్లో పడిదాని కన్యాయం చేసి, దాని చావుకు కారకుడయ్యావని అనేదాన్ని నేనెప్పుడూ అతన్ని. ఎన్నన్నా కన్నా అయితే తిరిగి రాదుకదా!

*(ఆంధ్ర జ్యోతి వీక్లీ, తే. 28-11-97)*

## మా ఇలవేల్పు

మా ఇలవేల్పు శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ చందలూరు మహాలక్ష్మమ్మ అమ్మవారు అంటే లక్ష్మీదేవి.

ఆమెపై మా నాన్నగారు కీ॥శే॥ పోలవరం సుందర వేంకట శేషాచలపతిరావుగారు ఎన్నో పాటలు, శతకం, పంచరత్నాలు వ్రాశారు.

మా నాన్నగారు ఎక్కువకాలం అమ్మవారి పూజలోనే కాలంగడిపేవారు. ఆయన గతించినా మా దాయాదులు మాకు చేసిన అన్యాయాలకు ఈనాడు మేము ఏలోటూ లేకుండా బ్రతుకుతున్నామంటే ఆ పూజా ఫలితమేకదా!

నేను ఉద్యోగంలో చేరింది శుక్రవారం, అమ్మవారికి ప్రీతికరమైన రోజు. అలాగే ప్రతిదీ శుక్రవారంనాడే మంచి జరగటం ఆనవాయితీగా వస్తోంది మాకు. గృహప్రవేశం కూడా అదేరోజు. 'శుక్రవారం' చూస్తాం తప్ప తిథులన్నీ మేం పట్టించుకోమంటే మహాలక్ష్మి అమ్మవారికి ప్రీతిపాత్రమైనదీ, మాకు ఎల్లప్పుడూ మంచి జరుగుతున్నదీ ఆ 'శుక్రవారం' రోజే అవటం వల్ల కదా!

*(భక్తి-ముక్తి-8/97)*

# 7 ఏమనుకుంటున్నారు?

## జయప్రద అడిగిన మూడు ప్రశ్నలకు -

"అంతులేని కథ" నాకు బాగా నచ్చింది. కుటుంబ బాధ్యతల వలయంలో చిక్కుకుని స్వసుఖాన్ని విడనాడి, మధ్య తరగతి జీవితాలకు ప్రతిబింబమైన ఉద్యోగినిగా మీరు సహజంగా నటించిన 'సరిత' పాత్ర మరువలేనిది.

*(చిత్రభూమి- 30.7.1980)*

## ఆస్కార్ అవార్డ్‌కు అర్హత ఉన్న నటుడు

"శంకరాభరణం శంకరశాస్త్రి"గా ఈనాడు ఆంధ్ర, ఆంధ్రేతరుల సీరాజనాలందుకుంటున్న సోమయాజులుగారు చిత్ర విజయానికి సగం కారకులు అంటే సముచితంగా ఉంటుందేమో!

సాహిత్య, సంగీత పరంగా ఆ చిత్రంలోని పాటలు హృదయరంజకంగా ఉన్నాకూడా, ఆ పాటలు వినేటప్పుడు 'సోమయాజుల సాహిత్యాభినయం వల్లనే ప్రతివారి కళ్ళకు కట్టినట్లుండి అంతగా పాప్యులర్ అవుతున్నాయా?' అనిపిస్తుంది నాకు.

'త్యాగయ్య'గా 'త్యాగరాజ రామాయణం'లో వారిని దర్శించబోవటం మావంటి సంగీతాభిమానులకు నయనానందకరం.

ఆస్కార్ అవార్డుకు అర్హత గల నటులు సోమయాజులుగారనుకుంటే అతిశయోక్తి కాదేమో! *(చిత్రభూమి, తేది: 1.4.81)*

## ఒకరోజు ముఖ్యమంత్రి అయితే ఏం చేస్తారు?

ఒకరోజు అంటే ఇరవై నాలుగు గంటలు కదా!

నిజానికి చీఫ్ మినిస్టర్ కాగానే అభిమానం కురిపించే వాళ్ళూ, లోపల విషం పెట్టుకుని, పైకి ఫార్మల్‌గా అభినందనలు తెల్పే వాళ్ళతోనే సగం రోజు గడిచిపోతుంది. మిగతా సగం రోజులో అన్ని విభాగాల అధిపతులతో మాట్లాడటం (అంటే పెండింగ్‌లో ఉన్న వివిధ ప్రాజెక్ట్ పనులూ, వగైరాల గురించి)తోనే ఆ రోజు అయిపోతుంది.

కానీ వీటన్నింటికీ అతీతంగా ఉండి ఏం చేయదల్చుకోవాలనుకున్నా కాగితంమీద కొన్ని రోజులు నడుస్తాయి పనుల వివరాలు. అంటే క్లర్క్ పుటప్‌చేసి అంచెలవారీగా చీఫ్ మినిస్టర్ దగ్గరకొచ్చే సరికి కొన్ని రోజులే పడతాయి. అది మళ్ళీ టైపవ్వాలి, డిస్పాచ్ కావాలి.

అలాకాకుండా నేరుగా అన్ని శాఖాధికారులనూ పిల్చి, పెండింగ్‌లో ఉన్నసమస్యలను వారితో చర్చించి, టెలిఫోన్‌ద్వారా క్రింది ఆఫీసర్ల నుండి 'జవాబు' రప్పించాలన్నా రోజు సరిపోదు.

వీటన్నింటితో సంబంధం లేకుండా ఊహాలోకంలో ఉండి ఒక్కరోజులో ఏమి చేయగలమనుకుంటామంటే పెండింగ్ ప్రాజెక్టులకు కేంద్రంనుండి నిధులకోసం వ్రాయటం, జిల్లా అధికారులకు ఎక్కడా చెత్త అనేది కన్పించకుండా ప్రతి వీధీ పరిశుభ్రంగా

ఉండటాన్కి చర్యలు అప్పటికప్పుడు జారీ చేయటం, స్లమ్ ఏరియాలలో నివసించే వారికి పక్కా గృహాలు కట్టించే పథకానికి సంబంధిత శాఖలకు అనుమతిని మంజూరు చేయటం (తద్వారా వారిని కొన్ని అంటువ్యాధుల నుండి కాపాడటం జరుగుతుంది) స్త్రీ, శిశు, ప్రజా సంక్షేమ పథకాలన్నిటిపై సముచిత నిర్ణయాలు, పర్యావరణ సంరక్షణకు చెట్లు నాటే కార్యక్రమాలు, అస్తవ్యస్త విద్యావిధానంపై విద్యార్థులకు పుస్తకాల బరువు మోత కాకుండా సులభ సాధ్యమైన పద్ధతులపై ఆదేశాలు జారీ చేయటం, అందరి అధికారులకూ, ఆస్పత్రులు, పాఠశాలలు, రేషన్ దుకాణాలు, మొదలైన వాటిపై ఆకస్మిక తనిఖీలు జరిపి సత్వర చర్యలు తీసుకునేలా నిర్ణయాలు తీసుకోవటం, అనేక రకాల వృత్తుల ద్వారా నిరుద్యోగులకు ఉపాధి కల్పించే మార్గాలను కనుగొని వాటిని అమలు చేయటం, చాపక్రింద నీరులా ఉన్న లంచగొండితనాన్ని నిర్మూలించటానికి చర్యలు చేపట్టడం ఎన్నో...

ముఖ్యమంత్రిగా ఎన్నికైనప్పుడు ఒక రోజుకే సర్వీసు పరిమితం కాదు కాబట్టి పై పథకాలన్నీ నిస్వార్థంగా నిజాయితీగా ఆ మర్నాటినుండే అమలు జరిగేలా ప్రయత్నించటం అన్నివిధాలా శ్రేయస్కరం.

*(విశ్వరచన, తేది: 16.1.97)*

## అరుదైన ఆటోగ్రాఫ్‌లు

'మద్యపాన నిషేధం అవసరమా' అనే చర్చలో 'విశ్వసాహితీ' ఆధ్వర్యంలో 1993లో సిటీ సెంట్రల్ లైబ్రరీలో పాల్గొన్నాను. 'నిఖిలేశ్వర్' అందరికీ పరిచితులే కదా! కవిగా, వగైరా. అందుకని వారి ఆటోగ్రాఫ్ తీసుకోవాలనిపించింది. ఆ సభలో వారుండటంతో తీసుకోగలిగాను.

*(ఆంధ్రభూమి, తేది: 7.8.93)*

## న్యాయపీఠం ముందు వైద్యం:

### డా॥ జి.రామకృష్ణారెడ్డి మాకు దేవుడులాంటి వాడు!

మా అమ్మ పి.వి.సుబ్బమ్మగారు 1989 నుండి బాగా చిక్కిపోవటం మొదలుపెట్టారు. పొట్ట బాగా పెద్దదవటం, తరచూ వాంతులూ, విరేచనాలూ, తిండి సహించక పోవటంతో బాధపడేవారు. 1991లో అనుకోకుండా అదృష్టవశాత్తు హైదరాబాద్, గాంధీనగర్‌లోని జగదాంబ నర్సింగ్‌హోమ్‌కు తీసుకువెళ్ళటం జరిగింది. ఒక ప్రతిభగల గైనకాలజిస్ట్ డాక్టర్ టి.సీత అంతటి ప్రజ్ఞావంతులైన ఆ నర్సింగ్ హోమ్ అధిపతి, జనరల్ సర్జన్ అయిన డాక్టర్ జి.


డాక్టర్ జి.రామకృష్ణారెడ్డి

రామకృష్ణారెడ్డిల నైపుణ్యంతో బల్లమీదే పోతుందనుకున్న కేసును బ్రతికించారు.



అప్పటికే పెద్ద పెద్ద గడ్డలూ, నీటితో నిండిన కడుపుతో మా అమ్మగారి పరిస్థితి చాలా దారుణంగా ఉంది. వెంటనే ఆపరేషన్ చేయడంతో మా అమ్మగారు బ్రతికారు కాని ఆవిడ జబ్బు ఓవరియన్ క్యాన్సర్ మూడోస్టేజిలో ఉంది. అంతకుముందు మేం మా అమ్మగార్ని కొంతమంది డాక్టర్లకు చూపించాం కాని ఈ జబ్బు లక్షణం, ఆవిడ ఆకారమూ చూసి ఆ డాక్టర్లంతా పెదవి విరిచారు. కాని డాక్టర్ జి.రామకృష్ణారెడ్డి (ఎం.ఎస్)గారు ఈ కేస్ నొక ఛాలెంజ్‌గా తీసుకుని ప్రముఖ ఆంకాలజిస్ట్ అయిన డాక్టర్ సింహాద్రి చంద్రశేఖర్‌చేత కీమోథెరపీ ఇప్పించే ఏర్పాటు చేసారు. క్యాన్సర్ పేషెంట్ కావడంతో ఆవిడ యోనినుండి వెలువడే దుర్వాసనను పవర్‌ఫుల్ యాంటీ బయాటిక్స్ ద్వారానూ, క్యాటరైజేషన్ ద్వారానూ అరికట్టారు. అయితే ఆ తర్వాత మా అమ్మగారికి ఆకలి లేకపోవటంతో స్కానింగ్ ద్వారా కారణం తెలుసుకుని డాక్టర్ చంద్రశేఖర్‌తో కలిసి తనూ ఆపరేట్ చేసి లివర్‌లో ఉన్న నాడ్యూల్స్ (బుడిపెలు)నూ ఇతరత్రా క్లీన్ చేశారు. ఆ విధంగా మంచి మందులతో, డాక్టర్ రామకృష్ణారెడ్డి గారి మంచి హస్తవాసితో మా అమ్మగారు మూడేళ్ళు చాలా ఆరోగ్యంతో ఉన్నారు.

మూడేళ్ళ తర్వాత మళ్ళీ బ్లీడింగ్ అవటంతో రేడియేషన్ ఆంకాలజిస్ట్ అయిన డాక్టర్ ఆర్.వి.రావుతో రేడియేషన్ ట్రీట్‌మెంట్ పూర్తి కోర్సును ఇప్పించారు. ఒక సంవత్సరం బాగానే ఉన్నది మా అమ్మ. అయితే రేడియో థెరపీ ట్రీట్‌మెంట్‌వల్ల సహజంగా రెక్టమ్‌లో వచ్చే మార్పులకు మలంతో రక్తం పడుతుండేది. వెంటనే కొలనోస్కోపి చేయించి బెట్నసాల్ తదితర మందులతో 'ఎనిమా' ఇప్పిస్తూ తత్సంబంధిత నిపుణులను సంప్రదిస్తూ ఆయన మా అమ్మను బ్రతికించారు. మధ్యలో షుగర్ కంప్లయింట్, హార్ట్ ఎన్‌లార్జ్‌మెంట్ వచ్చినా వాటన్నిటినీ కంట్రోల్‌లో వుండేలా ఆయా నిపుణులద్వారా ఏర్పాటు చేయించారు. జననాంగంనుండి రక్తం కారటాన్ని సిస్టోస్కోపిద్వారా నియంత్రించారు.

తల్లిని దైవంగా భావించే నా సోదరుడికీ,



నాకూ 'మనశ్శాంతి'ని ప్రసాదించారు. 'వైద్యోనారాయణో హరిః' అన్న సూక్తికి ప్రతిరూపం ఆయన. ఎంతో ఉదార స్వభావంతో రోగులకు తన సేవలందిస్తూ ప్రతి నెలా తన స్వగ్రామమైన పశ్చిమగోదావరి జిల్లాలోని మల్లిపూడికి వెళ్ళి ఆ చుట్టుపక్కల నుండి వచ్చే రోగులకూ సేవలందిస్తూ అందరికీ 'దైవం'లా అన్పించే వారి ఫోటోను మా 'దేముడు'గా మా ఇంట్లో పెట్టుకుని కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

నా తల్లిగారి కేన్సర్ ట్రీట్‌మెంట్‌కు ముందు 1990 నాటి ఫోటోనూ, ఆమె సంపూర్ణ ఆరగ్యోవంతురాలైన తర్వాత ఇప్పటి ఫోటోనూ పాఠకులకు నిదర్శనాలుగా వుండటంకోసం పంపిస్తున్నాను. డాక్టర్‌గారికి ప్రచారం ఇష్టముండకపోయినప్పటికీ, వైద్యవృత్తిలో దైవంలాంటి డా. జి.రామ కృష్ణారెడ్డి గారి ఫోటోనూ పంపుతున్నాను. అలాంటి ఆదర్శ డాక్టర్ గురించి పదిమంది దృష్టికి తేవాల్సిన బాధ్యత రచయిత్రిగా నాకుందనే ఉద్దేశంతో ఇది వ్రాశాను. పవిత్రమైన వైద్యవృత్తికి కళంకం తెచ్చే డాక్టర్లున్నప్పటికీ డాక్టర్ రామకృష్ణారెడ్డి గారి లాంటి ఉన్నత వ్యక్తిత్వంగల వ్యక్తులను ఈ శీర్షికద్వారా పరిచయం చేయాలని నేనను కోవటం చంద్రునికో నూలు పోగులాంటిదే.

*(మా ఫ్యామిలీ డాక్టర్, జూన్, '97)*

# కదంబమాలకు అనుబంధం!

## సంగీత జ్ఞానము

ఆవిష్కరణ: తేది:15.2.95

"సంగీతజ్ఞానమూ, కథల సంపుటిని శ్రీ వాకాటి పాండురంగారావు ఆవిష్కరిస్తూ 'రచయిత్రికి జీవితంపట్ల మమకారం ఉందనీ, ఆమె నిరంతర అధ్యయనశీలియని" వ్యాఖ్యానించారు.

(ఆంధ్రప్రభ, ఈనాడు తేది:16.2.95, ఏలూరు టైమ్స్ తేది: 3.3.95)

*విశ్వరచన తేది: 16.2.95, 1.3.95)*

*విశ్వరచన, సమీక్ష శ్రీ సత్యప్రసాద్ తేది: 16.3.95)*

"రచయిత్రి తమ 'ముందుమాట'నే విషయాను క్రమణికగా మలిచి, చిన్న వ్యాఖ్యానాన్ని కూడా వారే అందించారు"

రచయిత్రి తను సున్నిత మనస్కురాలినని అపహాస్యాన్నీ, ఏ రకమైన కష్టాన్నీ భరించలేనిదానిననీ, కొందరు వ్యక్తులు, సంఘటనలవల్ల 'డిప్రెస్' అయ్యాననీ, యింకా ప్రముఖులతో పరిచయాలు బహు తక్కువనీ వ్రాసుకున్నారు. నిజానికవన్నీ ఆమె కథలలో ప్రతిబింబిస్తూనే ఉన్నాయి. క్రింది మధ్యతరగతికి చెందిన కుటుంబ జీవనసరళి, నెరవేరని ఆశయాలు, తీరని కోర్కెలవల్ల కలిగే అసంతృప్తి, పరిస్థితుల నెదిరించలేక రాజీ జీవితాల్ని వెళ్ళదీస్తున్న స్త్రీమూర్తి జీవిత చిత్రణ (ముఖ్యంగా 'బొమ్మా బొరుసూ'లో) వివరంగా కన్పిస్తోందీ కథలలో. స్వయంగా తను ప్రభుత్వోద్యోగి అయినందున ఉద్యోగినుల సాధక బాధకాల వివరణ వాస్తవానికి దగ్గరగా ఉన్నదీమె రచనలలో. వస్తు వైవిధ్యము, పాఠకులు సాఫీగా చదవగలిగేలా సాగిన శైలీ అభినందనీయం.

మరికొన్ని మంచి కథలను సంపుటాలుగా వెలువరించగలరని ఆశించవచ్చు.

**వనిత, తేది: జూన్ 95 :**

"ఈ కథలన్నీ వాస్తవ జీవితానికి దర్పణాలు. సాహిత్యపరంగా ప్రారంభంలోనూ, మధ్యమధ్యలోనూ ముగింపునకు కల్పనను జోడించడం జరిగింది! అంటూ ముందు మాటలో చెప్పిన రచయిత్రి యీ సంకలనాన్ని అందించారు. అక్కడక్కడ కార్టూన్లు, ముగ్గులు, వగైరా దర్శనమిస్తాయి. "సంగీతజ్ఞానమూ", 'ఓ ఇంటి కథ', 'సుశీల', 'వైద్యోనారాయణో హరిః' మొదలైన కథలను రచయిత్రి మనసుకు హత్తుకునే విధంగా చిత్రీకరించిన తీరు పాఠకుల ప్రశంసలను అందుకుంటుంది.

"ఇహముందు రచనలు చేసేందుకు- పరిస్థితులు, ఆరోగ్యం ఎంతవరకు అనుకూలిస్తాయో, దైవసంకల్పమెలా ఉంటుందో చెప్పలేను అని సందేహం వెలిబుచ్చుతున్న యీ రచయిత్రి కలంనుంచి మరిన్ని మంచి కథలు రావాలని, యీ కథల సంపుటిని చదివిన పాఠకుడు కోరుకుంటాడు.

రావిశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు, మొదలగు రచయితల స్థాయికి యీ కథలేమీ తీసిపోవని, మరిన్ని రచనలు చేయాలని **బిక్కి కృష్ణ** (సేవామందిర్, హిందూపూర్) మరి కొందరు మేధావులూ ప్రశంసించారు.అన్ని లైబ్రరీలకు యీ పుస్తకాలను పంపినపుడు చదివి.

## వ్యాస సుమమాల :

ఆవిష్కరణ: సెంట్రల్ లైబ్రరీలో, తేది: 15.2.95న సభలో త్రిపురనేని మహారధిగారు ప్రశంసిస్తూ రచయిత్రికి అధ్యయనాసక్తి పుష్కలంగా ఉన్నదని, అంశాలను సూటిగా, స్పష్టంగా చెప్పారని, ఆమె తన ఆలోచనలను, స్వచ్ఛంగా, స్పష్టంగా అక్షరాకృతి నివ్వటంలో కృతకృత్యులయ్యారని ప్రశంసించారు

*(ఏలూరు టైమ్స్, తేది:3.3.95, విశ్వరచన, తేది: 16.2.95, ఈనాడు, తేది: 16.2.95, ఆంధ్రప్రభ, తేది: 16.2.95)*

**వనిత:** సమీక్ష: (పే.89- 6/95)

రచయిత్రి పలు స్త్రీ సమస్యలను స్పృశించి, అందరికీ ఆమోదయోగ్యంగా పరిష్కారాన్ని చూచించడం ముదావహం. కానీ కొన్ని సమస్యలకు ఈ రచయిత్రి సూచించిన పరిష్కారాలు రాబోయే 21వ శతాబ్దాంతానికైనా నెరవేరే అవకాశం ఉందా? అనే విషయం పఠితల మెదళ్ళలో కదలాడుతుంది. అందుకేనేమో రచయిత్రి "ఇది నా మధురస్వప్నం' అనే వ్యాసంలో ఈ విశ్వంలో నెలకొని ఉన్న సమస్తమైన అవలక్షణాలూ సమూలంగా నాశనం కావాలని స్వప్నిస్తారు. ఆలోచన రేకెత్తించే వ్యాసాలతో నిండి ఉన్నదీ పుస్తకం.

చాలామంది పాఠకులు ప్రశంసల వర్షం కురిపించారు అన్ని వ్యాసాలపైనా.

---

## Vijayalakshmi, the poet and the painter

*It is possible to be poet or painter or songster. But it is rare that one can be embodiment of all the talent. Mrs Srigiriraju Vijayalakshmi is an examble of such talent. She is poet, story writer, painter and also a songster. Her paintings recently exhibited at a function of 'Viswa Sahithi' bear a new technique or colour composition in consonance of realism of Nature. Her line is an arrow that pierces at the final point without a vibration. Based on impressionism, her paintings carry meaning and purpose refreshing the on-looker. Her photos have a deep sense of heart thro' for the poor and downtrodden in the laps of nature. She was honoured by Sri P R Raju, member, Central Lalitha Kala Academy on the occasion.*

*(Unilit- Monthly..)*

## చందలూరు మహా లక్ష్మీదేవి భక్తి గీతాలు

తేది: 31.12.95న శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో శ్రీ చందలూరు మహాలక్ష్మిదేవి అమ్మవారిపై క్రీ.శే.పోలవరం సుందర వేంకట శేషాచలపతిరావుగారు వ్రాసిన కొన్ని ~~పాటలను క్రీ.శే.పోలవరం సుందర వేంకట శేషాచలపతిరావు గారు రచించిన~~ భక్తి గీతాలను ఆయన కుమార్తె శాస్త్రీయ సంగీత గాయని శ్రీగిరిరాజు విజయలక్ష్మి గానం చేసిన క్యాసెట్ యిది. సంప్రదాయ భక్తి గేయ సంపదను కాపాడాలనే విజయలక్ష్మి ఆలోచన అభినందనీయం. సంప్రదాయగీతాలను బ్రతికించాలనే గయని ప్రయత్నం అభినందనీయం.

*(ఈనాడు - సిటీ స్పెషల్ 9-1-96 వినోదిని - (శ్రవణానందం)*

శ్రీ కల్లూరి మురళీకృష్ణ తమ సుదీర్ఘ ప్రసంగంలో 'తాను వీటి గురించి చెప్పేంత అర్హతగల వాడిని కాను' అంటూ ఎక్స్‌పరిమెంటల్‌గా భక్తి పాటలకు వెస్టరన్ మ్యూజిక్‌ను జతచేస్తూ పాడిన పాటలు బాగున్నాయని, గాయని భక్తి రసం ఎంతవరకు అవసరమో అంతే తన గళంలో కురిపించారని, వగైరా, వగైరా మాట్లాడారు. అలాగే డా.పోతుకూచి కూడా ప్రశంసించారు. వేదికపైనున్న ప్రముఖులు నరసింహారావుగారు, వెంకటరెడ్డిగారు కూడా.

## పుస్తక ప్రపంచం

# వ్యాస సుమ మాల

రచయిత్రి: శ్రీమతి గిరిరాజు విజయలక్ష్మి: వెల: 10 రూపాయలు 1/8 డెమ్మీ- పుటలు-37, ప్రతులకు: రచయిత్రి శ్రీగిరిరాజు విజయలక్ష్మి కేరాఫ్, పోలవరం సుందరరామయ్య 365/ఎ. బాకారమ్, హైదరాబాద్-20. ఫోన్: 7644933.

ఎటువంటి అట్టహాసాలూ, ముందు మాటలు, వెనుకమాటలూ లేకుండా అతి సాదాసీదాగా తన వ్యాస సుమమాల వ్యాస సంపుటిని అచ్చొత్తించిన శ్రీమతి శ్రీగిరిరాజు విజయలక్ష్మిగార్ని అభినందించక తప్పదు. ఈనాడు పుస్తక ప్రచురణలో కొట్టొస్తున్నట్లు కనిపించే వ్యాపార ధోరణులు ఈ రచయిత్రికి నచ్చక ఇటువంటి ప్రయత్నం చేసినట్లనిపిస్తోంది. విజయలక్ష్మిగారి ధైర్యాన్ని మెచ్చుకోకుండా ఉండలేకపోతున్నాం. పోతే పుస్తకంలో పేజీకి నాలుగు లైన్లు చేర్పించి రేట్లు ఆకాశాన్ని అందుకునేలా చేస్తున్నారు నేటి రచయితలు. ఆ విషయంలో కూడా యీమె తనదైన బాణీని అనుసరించారు. రచయిత్రికి 'సింప్లిసిటీ' అంటే యిష్టం కావచ్చు.

విజయలక్ష్మిగారి పరిచయం అతి సాధారణంగా చేసుకున్నారామె గ్రంథ ప్రారంభంలో. దానిని బట్టి ఆమె ఎంతటి క్లీన్ మనిషో అర్థమవుతుంది. గ్రంథం మొత్తంలో 19 వ్యాసాలు చోటు చేసుకున్నాయి. కొన్నింటిని వ్యాసాలని అనలేం! అభిరుచులు అంటే బాగుంటుంది. దానికి ఉదాహరణ- 'మహిళావాణి'. ఏది వ్రాసినా రచయిత్రి భావాల్ని బట్టి బేరీజు వేస్తే ఈమె కొంతలో కొంత స్త్రీవాదాన్ని బలపరుస్తుందేమోనన్న అభిప్రాయం కలగకమానదు. దళితవాదం, స్త్రీవాదం ఈనాడు జెట్ స్పీడులో సాహిత్యలోకంలో దూసుకుపోతున్నాయి. ఈ రెండింటికీ ఈ భాషా ఆ భాషా అనే తేడా లేకుండా పాఠకులు బ్రహ్మరథం పడు తున్నారు. ఇది శుభసంకేతమే!

వనితల సమస్యలపట్ల రచయిత్రి గారు దూరాలోచన గలవారైనట్లు ఆయా సందర్భాలలో మనకు గోచరిస్తుంది. ఇవన్నీ సాహిత్య వ్యాసాలు మాత్రం కాదు. అమెరికా నుంచి ఆవకాయ జాడీదాకా పరిశీలించగల దృష్టి రచయిత్రికి పుష్కలంగా ఉంది.

కొన్ని వ్యాసాల్లో రచయిత్రి స్త్రీలలో కొందరికి నగలపైగల మోజును అవహేళన చేశారు. నిజం కూడా అంతేగదా! కాన్వెంటు చదువులపట్ల మోజును ఆమె సునిశితంగా విమర్శించిన తీరు బాగుంది. స్త్రీలలోగల 'బోర్' వ్యక్తులకి చురక పెట్టారు. అలాగే చెత్త సద్వినియోగం, పత్రికలవారి బాధ్యతలేనితనం, విడాకులు గురించి రెండు మూడు వ్యాసాలలో ఏకరువు పెట్టారు. ఇరుగుపొరుగు అమ్మలక్కల ఆగడాలు, వెండితెర వేధవ్యేషాలు, ఎలక్షన్ డ్యూటీలు, వక్కపొడి పొట్లాల రేకులతో డెకరేషన్లు వంటివెన్నో చెప్పారు.

నేడు వస్తున్న వ్యాసాల్లో ఎక్కువగా వ్యాసం సాహిత్యంగానో, వేదాంతపరంగానో, పండగల గురించో, క్రీడల గురించో, మహిళా మండలుల గురించో రావడమే తప్ప ఇటువంటి విలక్షణమైన వ్యాససంపుటి మధ్యలో రాలేదు. భిన్న కోణంలో విజయలక్ష్మిగారు ఆలోచించి ఈ వ్యాస సుమమాల కూర్చినట్లుంది. ఈ పుస్తకంలో గల లఘువ్యాసాలన్నీ సినీ సుందరి, కలువబాల, ఆంధ్రపత్రిక, ఆదివారం, మయూరి, ఆంధ్రభూమి వంటి ప్రసిద్ధ పత్రికలలో ప్రచురింపబడినవే కావడం ఒక గొప్ప సుగుణం.

డా.మంతెన

*(మయూరి వీక్లీ 21. మార్చి 97)*

